


అంతర్జాతీయ పిల్లల సంవత్సరం 79 సందర్భంలో

# chic-modithread

వారు ప్రప్రథమంగా సమర్పిస్తున్నారు.

# పిల్లల కుట్టుపని పోటీ








## ఎలా పాల్గొనాలి?

ఈ పైన చూపబడిన ఏనుగు డిజైను పోటీ ఎంట్రీ ఫారం మీద సరైన సైజు ప్రింటు చేయబడింది. మీరు చేయవలసినదల్లా ఈ డిజైను గాని లేదా మీకు నచ్చిన ఇంకేదైనా డిజైను గాని కనీసం 12×12 సెంటి మీటర్లు, ఎంబ్రాయిడరీ (అల్లిక) నిటింగ్ క్రోచెట్ టాటింగ్, అప్లిక్ వర్క్ లేక మీ చేతిపనుల నైపుణ్యం చూపించండి. కుట్టుపని అంతా మోడిథ్రెడ్‌తోనే చేయాలి. మీ అందమైన డిజైను రంగుల కలయిక, కుట్టిన కుట్టుకి నీటికి తోడు అతి నీటుగా ఉన్న ఎంట్రీలు మాత్రం ఎన్నుకోబడతాయి. పోటీ ఎంట్రీ కూపను సరిగ్గా నింపి, మీరు వాడిన మోడిథ్రెడ్ లేబుల్స్‌ను ప్రతి ఎంట్రీతోను జత చేసి పంపాలి.

పోటీ ఎంట్రీ కూపను మరియు నిబంధనలు, షరతులు మోడిథ్రెడ్ డీలర్లు, మోడి క్రాఫ్ట్ షాపులు, మోడి డిపోలు మరియు డిస్ట్రిబ్యూటర్లు ఇంకా షిక్ మేగజైనులు ఏప్రిల్, మే, జూన్, జులై 1979 సంచికలలో లభించును.

## గెలుచుటకు అనేక అవకాశాలు

ఈ పోటీ దేశమంతటా 10 ప్రాంతాలుగా విభజించబడింది. ఒక్కొక్క ప్రాంతానికి 566 బహుమతులు. ప్రతి ప్రాంతంలోనూ మొదటి బహుమతిగా గెలుపొందిన ఎంట్రీలు అద్భుతమైన రాష్ట్రీయ బహుమతికి ఎన్నుకోబడతాయి. ఎంట్రీలు మీ ప్రాంతంలోనున్న మోడిథ్రెడ్ డిపోకి పంపండి, షరతులు, నిబంధనలలో దీని వివరను ఇవ్వబడింది.

ప్రతి ప్రాంతంలోను వేరు వేరుగా రెండు గ్రూపులకు వయసు వారిగా బహుమతులు ఇవ్వబడతాయి.

### 6 నుండి 11 సంవత్సరముల వారికి :

**Grand National Prize** Chic Modithread Scholarship worth Rs. 1000/- and "Needlework Young Princess 1979 Trophy" plus a Childcare hamper of dresses, toys and nursery furniture worth Rs. 1000/-.

**Ten 1st Prizes** Childcare hampers of dresses, toys and nursery furniture. Each hamper worth Rs. 500/-.

**Ten 2nd Prizes** Sets of dresses from chic Creations. Each set worth Rs. 200/-.

**Ten 3rd Prizes** Each worth Rs. 100/-. Gift hampers of Johnson's* Baby Powder, Johnson's* baby soap and Johnson's* baby cream. *Trade Mark

**100 Merit Prizes** Sets of Children's books from U.S.S.R. Book Centre and Lok Vangmaya Griha (Pvt.) Ltd., Bombay. Each set worth Rs. 20/-.

**100 Consolation Prizes** S.N.P. FUN-N-COLOUR Painting Kits worth Rs. 17/- each.

### 12 నుండి 16 సంవత్సరముల వారికి :

**Grand National Prize** Chic Modithread Scholarship worth Rs. 1000/- and "Needlework Princess 1979 Trophy" plus a gift cheque from Childcare worth Rs. 1000/-.

**Ten 1st Prizes** Gift cheques from Childcare Each worth Rs. 500/-.

**Ten 2nd Prizes** Sets of dresses from chic Creations. Each set worth Rs. 200/-.

**Ten 3rd Prizes** Each worth Rs. 100/-. Gift hampers of Johnson's* Baby Powder, Johnson's* Complexion Cream and Carefree* Sanitary Napkins. *Trade Mark

**100 Merit Prizes** Sets of books from U.S.S.R. Book Centre and Lok Vangmaya Griha (Pvt.) Ltd., Bombay. Each set worth Rs. 20/-.

**100 Consolation Prizes** Chic Needlework Kits worth Rs. 17/- each.

**First 500 entries in each of the ten territories will receive a Duraflex Plastic book jacket**

పిల్లల ప్రత్యేక విభాగం షిక్ మేగజైనులోని పిక్-చెర్స్ చదవండి.

పోటీ వివరములకు Chic Publications, Akash Ganga, 89, Bhulabhai Desai Road, Bombay 400026.

త్వరపడండి! పోటీ ముగింపు తేది 31 జులై 1979

ఎంట్రీలు మీ ప్రాంతంలోని మోడిథ్రెడ్ డిపోకి పంపండి. షరతులు, నిబంధనలలో దీని వివరను చూడండి.

# చందమామ కేమెల్
## రంగుల పోటీ
ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

**P.B. No. 9928, COLABA, Bombay-400 005.**

ఫలితములు తుది నిశ్చయముగాను, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ____________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

చుక్కల గీతల వెంట కత్తిరించండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. *30-6-1979*

**CONTEST NO·9**

# చందమామ

జూన్ 1979



ఈ సంచికలో
కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-25
సంవత్సర చందా: 15-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ ''శాంతుడి యుద్ధకాంక్ష'' ] కొండపనేని మురళీమోహన్ రచన. రాజులైనా, మామూలు మనుషులైనా శాంతి కోరటం మంచిదే. అయితే, ఎలాగైనా అశాంతి తప్పని సరి అయిన పరిస్థితిలో ఘర్షణకు సిద్ధపడటమే నిజమైన శాంతికాముకత్వం అనిపించుకుంటుంది !

## అమరవాణి

సాధోః ప్రకోపితస్యాపి
మనో నాయాతి విక్రియామ్,
న హి తాపయితుం శక్యం
సముద్రాంభః తృణోల్కయా !

[ సాధువులకు ఎంత కోపం తెప్పించినా వికారం కలగదు. గడ్డి మంటతో సముద్రజలాన్ని వేడెక్కించటం సాధ్యంకాదు గదా! ]

సంపుటి 64 జూన్ '79 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**వై. చంద్రశేఖరరావు, రూర్కెలా (ఒరిస్సా)**

ప్ర: 'అగస్త్యుడు' కథలో ఇల్వలుడు వాతాపి అనే వాణ్ణి మేకగా మార్చి, వండి, అతిథులుగా వచ్చిన బ్రాహ్మణులకు పెట్టేవాడు అని వ్రాశారు. అంటే పురాణపు బ్రాహ్మణులు మేకమాంసం తినేవారనే కదా?

స: అవును. వేదకాలపు ఆర్యులు 13 రకాల జంతువులను యజ్ఞపశువులుగా ఉపయోగించేవారట. వాటిలో గోవులు కూడా ఉండేవి. అయితే వేదయుగం ముగియక ముందే గోవధపై నిషేధం వచ్చింది. బ్రాహ్మణులు మాంసాహారం తినటం మానివేయటానికి కారణం జైనమతం అయి ఉంటుంది. బౌద్ధులు అహింసావాదులే అయినా మాంసభక్షణ విసర్జించలేదు. ఆకలికి తాళలేక బ్రాహ్మణయువకులు ఆవును చంపి తిన్న కథ కథాసరిత్సాగరంలో ఉన్నది.

**టి. ఎల్. శ్రీనివాస్, వరంగల్లు (ఆంధ్ర)**

ప్ర: రామాయణ, మహాభారత పురాణ గాథలు కవుల కల్పనయా? లేక జరిగినవా? ఒకవేళ జరిగినట్టయితే రెంటిలో ఏది ముందు జరిగినది?

స: రామాయణ, భారత కథలు ఆదిలో వీరగాథలనీ, ఆ రూపంలో వాటిని గానం మాత్రమే చెయ్యటంవల్ల అవి "పుక్కిటి" పురాణాలుగా ఉండి అనేక కల్పనలకు గురి అయి, వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు వివరాలను సమకూర్చుకున్నాయనీ, తరవాత వాటికి లిఖితరూపం వచ్చిందనీ పరిశోధకులు చెబుతారు. ఒక్కొక్క రామాయణం ఒక్కొక్క తీరుగా ఉండటానికీ, భారతంలో మూల కథకు సంబంధం లేని అనేక ఉపాఖ్యానాలు చేరటానికీ కారణం ఆ రచనలకు ప్రాంతీయ పుక్కిటి పురణాలు ఆధారం కావటం కావచ్చు.

వీరగాథలు పూర్తి కల్పనలుగా ఉండవు. వాటికి ఆధారంగా ఏదో ఒక వాస్తవసంఘటన ఉండి ఉంటుంది. దాన్ని రసస్ఫూర్తి కలిగేలాగా కవి – గాయకులు కల్పనలతో నింపుతారు. కొంత కాలానికి అసలు కథ కన్న కల్పనలు ముఖ్యమవుతాయి. రామాయణంలోని రాముడూ, భారతంలోని కృష్ణుడూ అవతార పురుష లయారు. రామాయణానికి సంబంధించని రాముడు ఉన్నాడో లేడో తెలియదుగాని, భారతానికి సంబంధించని కృష్ణుడు (దేవకీనందనుడైన వాసుదేవుడు) ఉపనిషత్తులలో ఉన్నాడు.




**72**

విశ్వాసంగల ముంగిస

దేవశర్మ అనే పేద బ్రాహ్మడికి లేకలేక, చాలా కాలానికి ఒక మగబిడ్డ కలిగాడు. ఆ బిడ్డను చూసుకుని తల్లిదండ్రులు పరమానంద భరితులయ్యారు. చందనం పూసుకున్న కన్న కూడా పుత్రస్పర్శ చల్లగా ఉంటుందిగద. కొడుకు కోసం సోదరులనూ, తండ్రినీ, సంరక్షకుణ్ణీ కూడా తృణీకరిస్తారు.

పిల్లలు లేని కాలంలో ఆ ఇంట ఒక ముంగిస పెరిగింది. అది స్వేచ్ఛగా ఇల్లంతా తిరిగేది. అదివరకు దాన్ని తమ బిడ్డలాగా చూసుకున్న బ్రాహ్మణ దంపతులు, ఇప్పుడు అది తమ శిశువుకు ఏం కీడు చేసి పోతుందోనని భయపడసాగారు. తమ బిడ్డను గురించి వారికి గల మితి మీరిన ఆందోళనే ఈ భయానికి కారణం.

ప్రసవించిన పదో రోజున బ్రాహ్మడి భార్య పురిటిస్నానం చెయ్యటానికని నదికి వెళ్ళింది. పోబోతూ ఆమె తన భర్తతో, ''నేను స్నానానికి వెళుతున్నాను. బిడ్డను కాస్త జాగ్రత్తగా చూస్తూ ఉండండి,'' అని హెచ్చరించింది.

ఆమె వెళ్ళిన కొద్దిసేపటికి రాణిగారి పరిచారిక వచ్చి బ్రాహ్మడితో, ''రాణిగారు స్వయంపాకమూ, దక్షిణా ఇస్తారట. వచ్చి తీసుకో.'' అని చెప్పింది.

రాణిగారిచ్చే దాని మీది ఆశకొద్దీ బ్రాహ్మడు తన బిడ్డనూ, ఇంటినీ ముంగిస రక్షణలో ఉంచి, వెంటనే బయలుదేరి వెళ్ళాడు.

అతను వెళ్ళిన కొంతసేపటికి, గోడలోని కలుగులోనుంచి ఒక పాము పరిగెత్తుకుంటూ బిడ్డ కేసి వచ్చింది. సహజ




వైరంకొద్దీ ముంగిస దానితో కలియబడి హోరాహోరి పోరాడి, చంపి ముక్కలు ముక్కలు చేసింది.

ఇంతలో దానికి బ్రాహ్మడు తిరిగివస్తూ కనిపించాడు. తాను సాధించిన విజయానికి పొంగిపోతూ, రక్తసిక్తమైన నోటితో, ముంగిస బ్రాహ్మడికి ఎదురు వెళ్ళింది. బ్రాహ్మడు దాని నోట రక్తం చూసి, అది తన బిడ్డను చంపిందనుకుని, మరో ఆలోచన చెయ్యకుండా, తన చేతికర్రతో ముంగిసను బలంగా కొట్టి చంపాడు.

కాని అతను ఇంట్లోకి పోగానే నిద్ర పోతున్న శిశువూ, ముక్కలుగా తెగిఉన్న పామూ కనిపించాయి.

"అయ్యో, ఎంత పాడు పని చేశాను! పాపిష్ఠివాణ్ణి, నా బిడ్డను రక్షించిన ముంగిసను చేతులారా చంపుకున్నాను." అని బ్రాహ్మడు దుఃఖాన్ని ఆపుకోలేక నేల మీద పొర్లిగింతలూ పెట్టుతూ, తలా రొమ్మూ బాదుకోసాగాడు.

అప్పుడతని భార్య తిరిగి వచ్చి, "ఏమిటది? ఎందుకు శోకాలు పెడుతున్నావు?" అని అడిగింది.

బ్రాహ్మడు ఆమెకు జరిగినదంతా చెప్పాడు. అంతా విని ఆమె, "దురాశకొద్దీ, బిడ్డను చూస్తూండమని నేను చెప్పిన మాట పాటించావు కావు. అందుకు ఫలితమేమంటే, మన బిడ్డను కాపాడిన అమాయిక ప్రాణి నిష్కారణంగా చచ్చింది. ఆశ ఉండవచ్చుగాని, దురాశ దుఃఖం చేటని మన పెద్దలు ఊరికే చెప్పారా? దురాశగలవాడి నెత్తిన చక్రం ఎక్కి తిరగలేదా?" అన్నది.

"ఏమిటా కథ?" అని బ్రాహ్మడు అడిగితే అతని భార్య ఇలా చెప్పింది:

### ఆశాపాతకుడు

అల్పలోభీ, మితలోభీ, అతిలోభీ, అత్యంతలోభీ అని నలుగురు బ్రాహ్మణ యువకులు, గాఢ స్నేహితులు ఉండేవాళ్ళు. అందరూ దారిద్ర్యబాధ అనుభవిస్తున్నవాళ్ళే. ఒకనాడు వాళ్లు నలుగురూ

కలిసి ఉన్న సమయంలో అత్యంత లోభి మిగిలినవాళ్ళతో ఇలా అన్నాడు :

"మిత్రులారా, దారిద్ర్యాన్ని మించిన అవమానం లేదు. బంధువుల మధ్య దరిద్రుడుగా జీవించేకన్న క్రూరమృగాలు తిరిగే అరణ్యాలలో, ముళ్ళ కంపల మధ్య నివసిస్తూ, గడ్డిలో పడుకోవటం మేలు. తనను ఎంతో విశ్వాసంతో సేవించుకునే పేదవాణ్ణి యజమాని కూడా తిరస్కారంతో చూస్తాడు; ఇతరత్రా ఎంతో సజ్జనులైన బంధువులు సైతం పేదవాడిపట్ల నిర్దయగా ప్రవర్తిస్తారు. వారిలో ఉండే సద్గుణాలు రాణించవు. వారిని సొంత కొడుకులే విసర్జించుతారు, భార్యలు లక్ష్య పెట్టరు, స్నేహితులు కన్నెత్తి చూడరు. ఈ ప్రపంచంలో ధైర్యమూ, అందమూ, వాక్చాతుర్యమూ, చమత్కారమూ, విజ్ఞానమూ, యుద్ధవిద్యాకౌశలమూ లాటివి ఎన్ని ఉన్నా, కొంత అయినా సంపద లేనిదే మనిషికి కీర్తి ప్రతిష్ఠలు రావు. డబ్బు ఉండాలేగాని, ఇలాటి గుణాలతో లోకాన్ని జయించవచ్చు. అది లేకపోతే అంతా వృథా. అందుచేత మనం దేశ సంచారం చేసి ధనార్జన చేతాం."

ఇందుకు మిగిలినవాళ్ళు సరేనన్నారు. త్వరలోనే నలుగురూ స్వస్థలం విడిచి పెట్టి, ధనంకోసం బయలుదేరారు. పూట



గడవనివాడు బంధుమిత్రులనూ, తల్లినీ, జన్మభూమినీ విసర్జించి దేశాంతరాలకు పోక ఏం చేస్తాడు ?

వాళ్లు కొద్ది రోజులకు అవంతీదేశాన్ని చేరుకున్నారు, సిప్రీనదిలో స్నానంచేసి, నది ఒడ్డున గల ఆలయంలో మహాకాలుణ్ణి (శివుణ్ణి) సేవించారు. వారు ఆలయం నుంచి బయటికి వచ్చేటప్పుడు, భైరవానందు డనే సుప్రసిద్ధ తాంత్రికసన్యాసి కలిశాడు. వాళ్ళు ఆయనకు ప్రణామం చేసి, ఆయన వెంట, సమీపంలోనే ఉన్న ఆయన మఠానికి వెళ్లారు.

"మీరెవరు ? ఎక్కడినుంచి వస్తున్నారు? ఎక్కడికి పోదలుచుకున్నారు?

మీ ఆశయం ఏమిటి?'' అని ఆయన వారిని అడిగాడు.

''మేం ధనాన్ని వెతుకుతూ తిరుగుతున్నాం. ఈ అన్వేషణలో చావనైనా చస్తాంగాని, అన్వేషణ మానం. మంత్ర శక్తితో నిక్షిప్తమై ఉన్న నిధులను తెలుసుకుని, ధనికులు కావచ్చునట. అలాటి మంత్రవేత్తను పట్టుకోవాలని మా ఆశయం. సాహసం కలిగి, ఎందుకైనా సిద్ధపడిన వాడికి అసాధ్యమనిపించేవి కూడా సాధ్యమవుతాయి. ఒకడు ఆకాశంనుంచి అధఃపతనం చెందుతాడు; మరొకడు నరకంలో నుంచి పైకివచ్చి, నాలుగు సముద్రాలనూ ఏలుతాడు. పతనానికీ, ఉన్నతికీ కారణం విధి కానేకాదు, కృషి లోపమూ, కృషి బలమూ నూ. మానవ ప్రయత్నం యాదృచ్ఛికంగా ఫలించటమే అదృష్టం. సాహసులు అధికారాన్ని లక్ష్యపెట్టరు, తమ ప్రాణాలను అంతకన్న లక్ష్యపెట్టరు. వారి దుస్సాహసం మహా ఉదాత్తమైనది. ఈ ప్రపంచంలో అమితంగా శ్రమించకుండా ఏ సుఖమూ లభ్యంకాదు. నారాయణుడు లక్ష్మిని పొందటానికి చేతులు బొబ్బలెక్కేలాగా సముద్రాన్ని మధించాడు. శ్రమించనివాడి సంపద తరిగిపోనారంభిస్తుంది. శౌర్యంలేని రాజు ఇతరుల రాజ్యాన్ని గెలవలేడు సరికదా, తన రాజ్యాన్నే నిలుపుకోలేడు. నిధి నేల మాళిగలలో, నాగుపాముల రక్షణలో ఉండనీ; పిశాచాలను సంతృప్తిపరచటం వల్లగాని, ప్రేతభూములలో శవాల మాంసాన్ని భూతాలకు అమ్మటం ద్వారా కాని లభ్యంకానీ; నిధి ఉన్న చోటు ఆరిపోయే మంత్రపు వత్తుల ద్వారా సూచించబడనీ! మేం అన్నిటికీ సిద్ధమే. నిన్ను చూడగా అతీత శక్తులు గలవాడుగా కనబడుతున్నావు. నువు మాకు సహాయం చెయ్యగలవు. తప్పక చేసి తీరాలి. అద్భుతకార్యాలూ, గొప్ప పనులూ గొప్పవాడి వల్లనే కావాలి. బడబాగ్నిని సముద్రుడే భరించగలడు,'' అన్నారు నలుగురు మిత్రులు.





# భల్లూక మాంత్రికుడు

## 12

[దుర్ముఖరాజు కోటను ఆక్రమించిన సామంతుడు, తలారి భల్లూకుడూ వాళ్ళ పైకి, సైనికుల్ని పంపాడు. దొంగ నాగమల్లు సేనానాయకుడికి, తాను రాజు దుర్ముఖుణ్ణి బంధించి తెచ్చినట్టు చెప్పాడు. సామంతుడు తలారి భల్లూకుడి దగ్గిరకు వచ్చాడు. రాజు దుర్ముఖుడు ఉగ్రుడైపోయి, సామంతుడి మీదికి దూకాడు. సామంతుడు పారిపోసాగాడు. తరవాత—]

సామంతు భూపతి తన గుర్రాన్ని ఆపి, వెనుదిరిగి, వెంటబడి తరుముకు వస్తున్న రాజుదుర్ముఖుణ్ణి ఎదిరించే ప్రయత్నం చేయకుండా, తెరిచివున్న కోట ద్వారాల కేసి గుర్రాన్ని దౌడు తీయించసాగాడు. తమ రాజు అలా శత్రువుకు వెన్నిచ్చి పారిపోవటం చూసిన సేనాని కూడా, తన వెంటవున్న సైనికులను హెచ్చరించి, కోటవైపుకు గుర్రాన్ని తిప్పాడు.

సేనాని అలా పారిపోయే ప్రయత్నం చేస్తున్నంతలో, అతడి వెంటవున్న ధైర్యవంతులైన ఇద్దరు సైనికులు, అతడితో, "అయ్యా, మనపైకి దాడి వచ్చిన శత్రువులు పదిమంది అయినా లేరు. కొత్తగా రాజైన సామంతుణ్ణీ, పాతరాజు దుర్ముఖుణ్ణీ అలా ఒకరినొకర్ని కత్తులతో నరుక్కోనిద్దాం. ఈ లోపల మనం యీ కొద్దిమంది శత్రువులను చుట్టుముట్టి హతం



మధ్యకు పోవటం చావు కోరి తెచ్చుకోవటమే. ఇక కదిలి, అడ్డం వచ్చిన శత్రువులను నరుక్కుంటూపోతే తప్ప, లేకపోతే ఆ దుర్ముఖుణ్ణి రక్షించలేం," అన్నాడు.

ఆ మాటలు వింటూనే రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను పైకెత్తి, ప్రళయ భయంకరంగా హుంకరించి, "హేయ్, సామంతు సూర్యభూపతి సైనికుల్లారా, జాగ్రత్త! రాజు దుర్ముఖుడికి, మీలో ఎవరిపల్లనైనా హాని జరిగిందో, మీ అందర్నీ చిత్రవధ చేస్తాను," అంటూ కోటవైపుకు బయలుదేరాడు.

ఉగ్రదండుడు అలా కదలటం చూస్తూనే, రాజు కావాలనే దురాశతో ఏమిచేయటమా అని ఆలోచిస్తున్న సేనాని చప్పున గుర్రాన్ని వెనుదిప్పి, "ఒరే, మనం రాక్షసుల్నీ, గండ్రగొడ్డళ్ళు పట్టిన ఎలుగుబంట్లనూ ఎదిరించి బతకలేం. కోట గోడలే మనకు శరణ్యం. రండి, కోట ప్రవేశిస్తూనే, ద్వారాలు బంధిద్దాం," అంటూ పారిపోసాగాడు.

సేనాని కోటకేసి పారిపోవటం చూస్తూనే చాలామంది సైనికులు అతణ్ణి అనుసరించారు. తలారి భల్లూకుడు, మొండి తొండపుటేనుగు కుంభస్థలం మీద వున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవిక సేవకా! నీ అలవాటు ప్రకారం, ఏదో

చేయవచ్చు. ఆ తరవాత పాత, కొత్త రాజుల ప్రమేయం లేకుండా, మీరే ఉదయగిరికి రాజై పోవచ్చు," అన్నారు.

సైనికులు యిలా అనగానే సామంతుడి సేనానికి ఒక కొత్త ఆశ పుట్టింది. అతడు గుర్రాన్ని వెనుదిప్పి, ఏనుగుల మీద వున్న తలారి భల్లూకుడు వాళ్ళకేసి చూశాడు. భల్లూకుడు గొడ్డలి పైకెత్తి, దొంగ నాగమల్లూ, అతడి అనుచరుల్నీ; దుర్ముఖుడి అంగరక్షకుల్నీ హెచ్చరిస్తూ, "ఒరే, దుస్సాహసానికి పోయి రాజుదుర్ముఖుడు రాజ్యంతోపాటు ప్రాణాలు కూడా పోగొట్టుకునేలా వున్నాడు. మనం పక్కన లేకుండా అతడు, అంతమంది శత్రువుల

పిట్టలను బాణాలతో కొట్టినట్టు, పారిపో తున్న సైనికులపై బాణాలు వదిలి, వాళ్ళను చంపకు. మనం దుర్ముఖ రాజును కొద్ది క్షణాలపాటు పోయిన సింహాసనం మీద కుర్చోపెట్టి, అతడి తల తీసుకుని, భల్లూక మాంత్రికుడి దగ్గిరకు పోదాం. అనవసర రక్తపాతం ఎందుకు?'' అన్నాడు.

ఏనుగుల పైన వున్న తలారి భల్లూ కుడూ, దొంగ నాగమల్లూ, దుర్ముఖుడి అంగరక్షకులూ; రాక్షసుడు ఉగ్రదండుడి వెనక తమ వాహనాలను పరిగెత్తిస్తూ, కోట ద్వారాలను చేరేంతలో, సామంతు సేనాని కొందరు సైనికులతో కోట ప్రవే శించి, ద్వారాలను చప్పున మూయిం చాడు. అప్పటికింకా కోట ద్వారాలను సమీపించని కొందరు అశ్వికులూ, సైని కులూ ప్రాణభయంతో హాహాకారాలు చేస్తూ, కోట గోడల వెంట చెల్లాచెదురుగా పారిపోయారు.

రాక్షసుడు ఉగ్రదండుడు ముందుగా కోట ద్వారాలను సమీపించి, రాతి గదతో వాటి మీద గట్టిగా రెండుసార్లు పొడిచి, అవేమాత్రం బెసకక పోవటంతో ఆశ్చర్య పోతూ, అక్కడికొచ్చిన తలారి భల్లూకు డితో, ''తలారి భల్లూకా! యీ సామంతు సేనాని ఎంత పిరికివాడో, అంత జిత్తుల



మారి ఘటం. ఇప్పుడేం చేయటం? రాజు దుర్ముఖుడు కోటలో ఒంటరిగా శత్రువుల మధ్య చిక్కుకుపోయాడు. అతగాడి ప్రాణాల మాటకేంగాని, భల్లూక మాంత్రికుడికి నువ్వు సమర్పించుకోవల సిన అతడి తల ఏమైపోతుందో అని నాకు దిగులుగా వున్నది. కోటద్వారాలు బద్దలు కొట్టటం ఎలా?'' అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు యిలా అనగానే తలారి భల్లూకుడికి నిలువెల్లా కంపరం ఎత్తిపోయింది. దుర్ముఖుడి తల తీసుకుపోకపోతే, ఆ మాంత్రికుడు తనను బతికినన్నాళ్ళూ, యిలా భల్లూకంగానే వదిలేస్తాడు. మనిషిగా పుట్టి, ఎంతోకాలం



ఏనుగు మీద ముందు కూర్చున్న ఆటవికుడు ఎగిరి కిందికి దూకి, పరిగెత్తి పోయి గండ్రగొడ్డలిని చేతికి తీసుకుని, "భల్లూక దొరా, అనవసరంగా ఆవేశ పడి, భల్లూక మాంత్రికుడి మహత్తుగల గండ్రగొడ్డలిని విరగ్గొట్టకు. కోటలో మనం జొరబడాలంటే, యీ మూసిన ద్వారాలను కాల్చి బూడిద చేయటం ఒక్కటే మార్గం." అన్నాడు.

"ఒరే, ఆటవిక సేవకా, ఆలోచన బాగానే వున్నది. కాని, యీ లోపల సామంతు సూర్యభూపతి, రాజు దుర్ముఖుణ్ణి చంపితే, అప్పుడు నా గతేంకాను?" అన్నాడు తలారి భల్లూకుడు కోపంగా.

మనిషిగా జీవించిన తను, అరణ్యాలు పట్టి, ఏ తేనెపట్టులో తింటూ జీవించటం కన్న నీచం మరొకటున్నదా!

తలారి భల్లూకుడు యిలా అనుకుని, ఎలా అయినా సరే రాజు దుర్ముఖుడి ప్రాణాలు కాపాడాలన్న ఆవేశంతో గండ్ర గొడ్డలి పైకెత్తి, "దిరిశెనవన, భైరవా!" అంటూ కేకపెట్టి, కోట ద్వారాల మీద బలంగా కొట్టాడు. గట్టి కొయ్యతో చేసిన తలుపుల మీద, బలమైన ఇనుప రేకు తాపడం చేసిన ద్వారాలు, ఆ దెబ్బకు చెక్కుచెదరకపోగా, వాటి తాకిడికి తలారి భల్లూకుడి చేతిలోని గండ్రగొడ్డలి ఎగిరి అంత దూరం పోయి కింద పడింది.

"ఆ మాటా నిజమే!" అంటూ రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి, నాలుగైదడుగులు వెనక్కువేసి, దూకుతూ పోయి కోటద్వారాల మీద బలంగా ఒక దెబ్బ కొట్టాడు.

రాక్షసుడి బలమైన గద దెబ్బకు ద్వారాలైతే విరగలేదుగాని, నెర్రెలు వారి వున్న వాటిపై కోటగోడ భాగం కొంత విరిగి, రాళ్ళూ రప్పలతో దభీమంటూ కింద పడింది. మొత్తం గోడ కూలుతున్నదేమో అన్న భయంతో ఉగ్రదండుడూ, తలారి భల్లూకుడూ, కోటద్వారాల దగ్గిరనుంచి దూరంగా పరిగెత్తి, తలలెత్తి చూశారు.

కోటగోడ మీద వాళ్ళ కంటబడిన దృశ్యం, అందరికీ ఆశ్చర్యంతోపాటు, భయం కూడా కలిగించింది. నల్లని దుస్తులు ధరించిన పెద్ద కోతి ఆకారం ఒకటి గోడ మీద కూర్చుని వున్నది. దాని చేతిలో పొడవాటి మంత్రదండం వున్నది. దాని పిడిమీద ఒకే వజ్రంలో మలిచిన ఎలుగు బంటి తల, సూర్యకాంతిలో మిలమిల మెరుస్తున్నది.

ఆ కోతి రూపాన్నీ, దాని చేతిలో వున్న మంత్రదండాన్నీ చూసి తలారిభల్లూకుడు గట్టిగా పళ్ళుకొరికి, పెద్దగా గొంతెత్తి, "ఒరే, కోతి రూపంలో వున్న నీవు, నిజంగా కోతివా లేక ఏదైనా పిశాచానివా? మహా శక్తిసంపన్నుడైన భల్లూకమాంత్రికుడి మంత్రదండం నీకెలా దొరికింది?" అన్నాడు.

ఆ ప్రశ్నకు కోతి రూపం కర్ణకఠోరంగా కిచకిచమని, "అరె ఒరే! భల్లూక రూపంలోవున్న నువ్వు, నిజంగా భల్లూకానివా లేక ఏదైనా పిశాచానివా?" అని అడిగింది.

తలారి భల్లూకుడు ఆ ప్రశ్న వింటూనే కోపం పట్టలేక గండ్రగొడ్డలి విసర బోయేంతలో, రాక్షసుడు ఉగ్రదండుడు అతణ్ణి ఆగమని, చిన్న గొంతుతో, "తలారి భల్లూకా, తొందరపడకు! నువ్వనే



ఆ భల్లూకమాంత్రికుడు ఏదో పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నాడని, నా అనుమానం. ముందు, యీ పిశాచికోతి నుంచి, మంచి మాటలతో, ఏం జరిగిందో తెలుసుకుందాం," అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించే లోపలే, చాటునుంచి ఆటవికుడు గురిపెట్టి వదిలిన బాణం రివ్వుమంటూ పిశాచికోతి కేసి పోయింది. కోతి యీసారి కిచకిచా అని నవ్వుతూ, ఉన్న చోటునుంచి కదల కుండానే, బాణాన్ని చప్పున ఎడమ చేతితో పడిసిపట్టుకుని, కుడిచేతిలో వున్న మంత్రదండాన్ని పైకెత్తి, "ఒరే, శుంఠాగ్రేసరులారా! నా శక్తి ఎలాంటిదో చూశారు



గదా? నేను మాయా మర్కటాన్ని! తెలిసిందా?'' అన్నది.

తలారి భల్లూకుడు రెండు చెవులూ ఒకసారి మూసుకుని, రాక్షసుడు ఉగ్ర దండుడితో, "ఉగ్రదండా! ఇక, యీ చచ్చు మర్కటంతో మాటలు పెంచి ప్రయోజనం లేదు. కోట లోపల రాజు దుర్ముఖుడు యింకా బతికే వున్నాడో లేక సామంతుడి చేతిలో హతమైపోయాడో తెలియటం లేదు. కోట తలుపులు బద్దలు కొట్టలేక పోతే, గోడలైనా ఎక్కి మనం లోపల ప్రవేశించాలి. మార్గం ఏమిటి?" అన్నాడు.

ఉగ్రదండుడు ఆశ్చర్యపడుతున్న వాడిలా, తలారి భల్లూకుడి కేసి చూసి, ''తలారి భల్లూకా, నీ కింకా సంగతి సందర్భాలు బాగా అర్థమైనట్టు లేదు. ఈ మాయా మర్కటాన్నసే దుర్మార్గుడు, భల్లూకమాంత్రికుడి మంత్రదండాన్ని చేజిక్కించుకోగలిగాడంటే, నిశ్చయంగా ఆ మాంత్రికు డీసరికి ప్రాణాలు పోగొట్టు కుని వుండాలి అలాంటి స్థితిలో నువ్వు, రాజు దుర్ముఖుడి కోసం అనవసరమైన చిక్కుల పాలవటం ఎందుకు? పద, ఇద్దరం అరణ్యంలోని కొండ ప్రాంతాల కాలక్షేపం చేద్దాం,'' అన్నాడు.

''రాక్షసుల వారిది, బహు మంచి సలహా, తలారి భల్లూక ప్రభో!'' అంటూ దొంగ నాగమల్లు ఏనుగు మీది నుంచి కిందికి దూకి, తన అనుచరులిద్దర్నీ, అంగరక్షకుల్నీ కూడా ఏనుగుమీది నుంచి కిందికి దిగమని, ''ఉగ్రదండులవారి ఆలోచన ఎలావున్నది? అందరం ఏకంగా అరణ్యంలో ఒకేచోట గుంపు కట్టివుంటే, మన దారిదోపిడీలను అడ్డగలవాళ్ళు, యీ భూప్రపంచంలో ఎవరుంటారు?'' అన్నాడు ఉత్సాహంగా.

తలారి భల్లూకుడు కోపంతో కళ్ళెర్ర చేసి, ఆటవికుడితో, ''ఒరే, ఆటవిక సేవకా! ఈ దొంగ నాగమల్లు పారి పోకుండా బాణం ఎక్కుపెట్టు,'' అని, మిగతా వాళ్ళందరితో, ''భల్లూక

మాంత్రికుడూ, మహా శౌర్యవంతుడైన కాళీవర్మ అనే యువకుడూ ఏ మయ్యారో వెతికేందుకు, నా వెంట వచ్చే వాళ్లెవరు? చేతు లెత్తండి ? '' అన్నాడు.

ఒక్క రాక్షసుడు ఉగ్రదండుడు తప్ప, అందరూ అంగీకార సూచకంగా చేతు లెత్తారు. ఆటవికుడు అనుమానంగా, '' తలారి భల్లూకయ్యా, ఈ దొంగ నాగ మల్లూ, అతడి నేస్తగాళ్ళూ మన వెంట వస్తామంటున్నారు. వాళ్ళను నమ్మటం ఎట్లా ? '' అన్నాడు.

'' వాళ్ళను నమ్మటం మంచిది కాదను కుంటే, యిక్కడే తలలు నరికేస్తాను. ఉగ్రదండా, నీ సంగతేమిటి ? ఆ భల్లూక మాంత్రికుడితో ఏదో పనివున్నట్టు లోగడ చెప్పావు గదా ? '' అన్నాడు తలారి భల్లూకుడు.

'' ఆ మాంత్రికుడు సజీవుడైతే గదా, నాకు పని ! '' అన్నాడు ఉగ్రదండుడు.

అంతలో మాయామర్కటం కోటగోడ మీద కీచుమంటూ పెద్దగా అరిచి, ''ఆహాఁ, ఈ కోటలో జరుగుతున్నది యుద్ధమా లేక దాగుడు మూతలాటా ? సైనికులు రెండు భాగాలుగా చీలిపోయి కొందరు పాతరాజు దుర్ముఖుణ్ణీ, మరి కొందరు సామంతు సూర్యభూపతినీ గెలిపించాలని చూస్తున్నారు. పిరికి



వెధవలు ముఖాముఖి యుద్ధం చేయ కుండా, స్తంభాల చాటునా, చెట్ల చాటునా పొంచివుండి కవ్వించుకుంటారెందుకు?" అన్నది.

ఆ మాటలతో తలారి భల్లూకుడు కొంచెం స్థిమితపడి, '' ఉగ్రదండా, రాజు నాకు ప్రాణాలతో దొరికే ఆశవున్నదన్న మాట ! ఈ భల్లూకరూపం నుంచి నాకు త్వరలో నే విముక్తి కలుగుతుంది,'' అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు చీదరించు కుంటున్నట్టు రాతిగదను నేలకు వేసి గట్టిగా కొట్టి, ''ఓయ్ఁ, తలారి భల్లూకా, నువ్వింకా పాతపాటే పాడుతున్నావు.

భల్లూక మాంత్రికుడు ప్రాణాలతో వుండగా, అతడి మంత్రదండాన్ని ఎవరైనా చేజిక్కించుకో గలరా?'' అని, మాయా మర్కటాన్ని చప్పట్లుచరిచి పిలిచి, "ఓయ్, మర్కటం! భల్లూక మాంత్రికుడి మంత్ర దండాన్ని తెచ్చావు బాగానేవుంది. మరి, అతడి శవాన్ని ఏం చేశావు?'' అని అడిగాడు.

''ఆ శవాన్ని నరికి కాకులకూ, గద్దలకూ ఆహారంగా వేశాను. కాని, ఆ పక్షులు ముట్టకుండా కాళీవర్మ అనే వాడి శిష్యుడు కాపలాకాస్తున్నాడు,'' అంటూ మంత్ర దండాన్ని గోడమీద నిలువునా ఆనించి, దానిమీదకెక్కి దూరంగాచూస్తూ, ''అరె, అరే! ఆ భల్లూక మాంత్రికుడు ఏ సంజీవనీ విద్యవల్లో తిరిగి బతికాడన్నమాట! వాడు ఎనుబోతు మీదా, పక్కన గుర్రం మీద కాళీవర్మ అనే వాడూ—యిటే వస్తున్నారు. వాళ్ళను పట్టుకునేందుకు చంద్రశిలా నగరరాజు జితకేతుడి మంత్రి సైన్యంతో వెంబడిస్తున్నాడు. వాళ్ళిద్దరి శిరశ్ఛేదం కళ్ళారా చూసిగాని, నే నిక్కడ్ణుంచి కదలను,'' అన్నది.

మాయామర్కటం యిలా అనగానే తలారిభల్లూకం, ''దిరిశెనవన భైరవా!'' అంటూ పెద్దగా అరిచి, ''ఒరే, చచ్చుకోతి వెధవా! ఇందాకటి నుంచి చూస్తున్నాను, నువు మాట్లాడేదేమిటి? నీ కేమైనా వెర్రా లేక మాకు వెర్రెత్తించాలని చూస్తున్నావా?'' అన్నాడు.

తలారి భల్లూకం మాట పూర్తి చేసే లోపలే, వేగంగా ముందు గుర్రం మీద కాళీవర్మా, వెనకగా ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ అక్కడికి వచ్చి, కోటగోడ మీదవున్న మాయామర్కటాన్ని చూస్తూనే, ''తలారి భల్లూకా! మంత్ర దండాన్ని దొంగిలించిన, యీ మాయా మర్కటాన్ని ప్రాణాలతో వదలగూడదు,'' అన్నారు.

ఆ మరుక్షణం మర్కటం కిచకిచా అంటూ నవ్వి, ఛెంగున ఎగిరి కోటలోపలికి దూకేశింది. —(ఇంకావుంది)






# శాంతుడి యుద్ధకాంక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల కళ్లారా చూస్తున్నప్పటికీ నువ్వు నిజంగా పట్టుదల గలవాడివో, కావో నాకు తెలియదు. మానవుల స్వభావం గురించి ఒక నిర్ణయానికి రావటం సాధ్యం కాదు. అందుకు నిదర్శనంగా నీకు శ్రీకేతుడి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

శ్రీకేతుడు విక్రమపురం అనే చిన్న దేశానికి రాజు. విక్రమపుర రాజులందరూ చాలాకాలంగా విదర్భరాజ్యానికి సామంతులు. వారు విదర్భకు కప్పం కట్టుతూ వచ్చారు. శ్రీకేతుడు తన తండ్రి తాతల కన్న గొప్ప యోధుడు. ప్రతాపంలో

## బేతాళ కథలు

విదర్భరాజు అతనితో ఎంత మాత్రమూ పోలడు. అందుచేత అంతరంగికులు శ్రీకేతుణ్ణి విదర్భ మీద యుద్ధం చెయ్యమనీ, యుద్ధంలో గెలిచి విక్రమపురాన్ని స్వతంత్ర రాజ్యం చెయ్యమనీ సలహా ఇచ్చారు. అయితే శ్రీకేతుడు అందుకు ఒప్పుకోలేదు. అతను శాంతికాముకుడు.

"మన దేశానికి ఇప్పుడేం లోటు వచ్చింది? కప్పం తీసుకుని విదర్భరాజు మనకు శత్రుభయంలేకుండా కాపాడతాడు. మనది ఒకసారి స్వతంత్రరాజ్యం అయినాక, విదర్భతోనే గాక, అనేక పరిసర రాజ్యాలతో యుద్ధాలుచేస్తూ, ప్రజలను అష్టకష్టాలకు గురిచేయవలసి వస్తుంది," అన్నాడు శ్రీకేతుడు.

"కాని, పరాధీనతకన్న స్వతంత్రంగా బతకటం గౌరవప్రదంకాదా? తమరు బాగా ఆలోచించండి," అన్నారు రాజుగారి అంతరంగికులు.

"పరాధీనత నా ఒక్కడిదేకదా? దానికోసం అనేక వేల ప్రాణులను యుద్ధంలో బలి పెట్టటం నా కిష్టం లేదు. మనది స్వతంత్ర రాజ్యం అయితే మన ప్రజలు ఇప్పటికన్న సుఖంగా బతుకుతారని లేదు. పై పెచ్చు, నేను చెప్పినట్టు, వాళ్లు ఎడతెగని యుద్ధాలకు గురికావచ్చు," అన్నాడు రాజు.

అతని శాంతి ప్రియత్వాన్ని అతని అంతరంగికులు హృదయ పూర్వకంగా మెచ్చుకున్నారు.



ఇలా ఉండగా విదర్భ దేశానికి కనీ వినీ ఎరగని కరువు సంప్రాప్తమయింది. అక్కడి ప్రజలలో అరాచకం ప్రబలుతున్నదనీ, వారు ఆకలి బాధకు తాళలేక సరిహద్దుల మీద ఉన్న రాజ్యాల మీద దాడులు చేస్తున్నారనీ వార్తలు వచ్చాయి.

శ్రీకేతుడు అకస్మాత్తుగా తన మంత్రులనూ, సేనాపతినీ, హితులనూ పిలిచి, "రెండు రోజుల లోపల సైన్యాలను అయత్తం చెయ్యండి. మనం పెద్ద ఎత్తున విదర్భపైకి దండెత్తిపోతున్నాం," అన్నాడు.

మొదట ఎవరూ రాజు మాట నమ్మలేక పోయారు. అంత శాంతికాముకుడికి యుద్ధకాంక్ష, విజయకాంక్ష ఎలా కలిగాయో, శత్రువు క్లిష్టపరిస్థితిలో ఉండగా దాడి చెయ్యాలన్న దుర్బుద్ధి శ్రీకేతుడిలాటి సజ్జనుడికి ఎందుకు కలిగిందో వారికి అర్థం కాలేదు.

వారి అనుమానాలకు చిరాకు పడుతూ శ్రీకేతుడు, "ఒక్క క్షణం అలస్యం కావటానికి వీలులేదు. సైన్యాలను సిద్ధం చెయ్యండి!" అన్నాడు.

రెండో రోజునే విక్రమపురి సేనలు విదర్భ మీద విరుచుకుపడ్డాయి. విదర్భ రాజుగాని, అతడి సేనలుగాని యుద్ధానికి తట్టుకునేస్థితిలో లేకపోవటంచేత శ్రీకేతుడికి విజయం అవలీలగా లభించింది. అతను విదర్భకు రాజుగా పట్టాభిషిక్తుడు అవుతూనే ఒక విషయం తెలుసుకున్నాడు. ఓడిపోయిన విదర్భరాజు కరువు పరిస్థితు



లలో ప్రజలకు ఉపయోగపడేట్టు రాచ గాదెలలో ధాన్యం నిల్వలుగాని, జలాశయాలలో తగినంత నీటి నిల్వలుగాని ఉండేలాగు శ్రద్ధచూపలేదు. శ్రీకేతుడు ఈ లోపాలను సరిచేసి, విదర్భను పాలించిన రాజులలో గొప్పవాడుగా ప్రసిద్ధికెక్కాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శ్రీకేతుడి శాంతి ప్రియత్వమూ, యుద్ధ విముఖతా వట్టి బూటకమేనా? విదర్భ అసహాయస్థితిలో ఉండగా అతను దానిపై యుద్ధం ప్రకటించిన తీరు చూస్తే, అతను లోగడ అలాటి ప్రయత్నం చెయ్యక పోవటానికి కారణం అపజయం పొందుతానన్న భయమేనని తోస్తుంది. అలాటి పిరికివాణ్ణి పరాక్రమవంతుడనటానికి వీలున్నదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శ్రీకేతుడు శాంతికాముకుడూ, యుద్ధవిముఖుడూ కాడనటానికి వీల్లేదు. ప్రజాక్షేమం కోసం అతను తన స్వాతంత్ర్యాన్ని కూడా లక్ష్యపెట్టలేదు. కాని అతను శాంతికోసం దేశక్షేమాన్నీ, ప్రజాక్షేమాన్నీ త్యాగంచేసే ఛాందసుడు కాడు. విదర్భ కాటకానికి గురి అయి, అక్కడి ప్రజలలో అరాజకం చెలరేగితే విక్రమపురికి వారివల్ల ఎంత ప్రమాదమైనా ఉన్నది. వాళ్ళు మిడతల దండులాగా విక్రమపురి పైన వచ్చి పడితే, విక్రమపురి ప్రజలకు యుద్ధాన్ని మించిన నష్టం తప్పక జరుగుతుంది. విదర్భరాజు తన ప్రజలను అదుపులో పెట్టలేక పోయాడని వార్తలద్వారా స్పష్టమయింది. అందుకే శ్రీకేతుడు యుద్ధ నిర్ణయం చెయ్యటమేగాక, అందుకోసం అంతగా తొందర పడ్డాడు కూడా. ఆ యుద్ధం అతని శాంతికాముకత్వానికే చిహ్నం అనవచ్చు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# దొంగల అంతు

సిందూరదేశపు సరిహద్దులో, కీకారణ్యంలో దొంగల ముఠా ఉండేది. దొంగలు ఊళ్ళ మీద పడి దోచుకుని, రాజభటులు వెంటపడినప్పుడు అరణ్యంలోకి పారిపోయేవారు. అరణ్యంలోకి ప్రవేశిస్తే రాజభటులు తిరిగి ప్రాణాలతో బయట పడలేక పోయేవాళ్ళు.

ఈ దొంగలను ఎలాగూ పట్టుకోలేక రాజు, దొంగల నాయకుడి తల నరికి తెచ్చినవాడికి తన కుమార్తె నిచ్చి, తన అనంతరం రాజును చేస్తానని ప్రకటించాడు.

ఈ ప్రకటన జరిగినాక దొంగల నాయకుడికి తన అనుచరులందరిలోనూ ద్రోహబుద్ధి ఉన్నట్టు కనబడింది. వాడు ఎవరినీ నమ్మలేక, ఎవరితోనూ చెప్పకుండా ఎటో పారిపోయాడు.

దొంగలు మరో నాయకుణ్ణి ఎన్నుకోవాలని చూశారు గాని, నాయకుడుగా ఉండటానికి ఎవడూ ఒప్పుకోలేదు. నాయకుడు లేని దొంగలు తలా ఒక దారీ అయిపోయారు. సిందూర దేశానికి దొంగల బెడద తప్పింది.

—కలువకొలను సదానంద





# అధికారిభార్య

ప్రచండ మహారాజు పరిపాలనలో ప్రతి గ్రామంలోనూ ఇద్దరు రాజోద్యోగులుండి, గ్రామానికి సంబంధించిన అన్ని పనులూ చూసుకునేవారు. అయితే ఈ రాజోద్యోగులు అధికార దుర్వినియోగం చెయ్యడమూ, లంచాలు మరగడమూ ఉంటుంది గనక, వారిని తణిఖీ చెయ్యడానికి కొంత మంది అధికారులను రాజు నియమించాడు. ఈ అధికారులు ముందుగా చెప్పకుండా ఏదో ఒక గ్రామానికి వెళ్లి, అక్కడి పరిస్థితులు స్వయంగా పరిశీలించి, రాజుకు నివేదిస్తూండే వారు.

అలాంటి అధికార్లలో రామభద్రుడు అనేవాడు ఒకడు వుండేవాడు. అతను ఏ గ్రామం తణిఖీ చెయ్యటానికి వెళ్ళినా తన భార్యను వెంట పెట్టుకుపోతూండేవాడు. అతను భార్య గీచిన గీటు దాటడని చెప్పుకునేవారు.

రామభద్రుడి భార్యకు పెద్ద అధికారి భార్యనన్న అహంకారం ఉండేది. ఆమె ఎక్కడికి వెళ్ళినా అందరిమీదా భర్తను మించి ఎక్కువ జులుం చేసేది. ఆమె భర్త పెద్ద అధికారి గదా అని, ఆయనతో మాటరాకుండా ఉండగలందులకు ఆమె ప్రవర్తనను అందరూ సహించేవారు.

కృష్ణాపురం అనే గ్రామంలో రాజోద్యోగులు హరీ, గిరీ అనే వాళ్ళు. వారు ఒకే ఇంట్లో రెండు భాగాలలో కాపరం ఉండేవాళ్ళు. రామభద్రుడు తన భార్యతోసహా ఆ గ్రామంవచ్చి, వారు ఉండే ఇంటనే దిగాడు.

హరీ, గిరీ చాలా నీతిపరులు. వాళ్లను గురించి అందరూ ఎంతో ఘనంగా చెప్పుకునేవారు. వారికి రామభద్రుడి నుంచి ఎలాటి భయమూ ఉండే అవకాశంలేదు. వాళ్ళు రామభద్రుడికి చక్కని సదు

జొన్నలగడ్డ రామలక్ష్మి

పాయాలన్నీ చేసి, అతన్ని ఊరు చూడ టానికి తీసుకువెళ్ళారు.

ఆ సమయంలో రామభద్రుడి భార్య హరి భార్యమీదా, గిరి భార్యమీదా చాలా దాష్టీకం చేసింది. ఆవిడకు మంచి నీళ్ళ దగ్గిర నుంచీ అన్నీ అందించాలి, ఎవరో ఒకరు ఆమెకు అస్తమానమూ విసురు తూండాలి. ఆమెకు సేవచేసి, చేసి, అలసిపోయిన గిరి భార్య ఆమె సరసన ఒక కుర్చీలో చేరబడింది. అది చూసి రామభద్రుడి భార్య, "నాతో సమంగా కుర్చీలో కూర్చున్నావా?" అని దెబ్బ లాడింది.

గిరి భార్య మండిపడి, "ఏం కూర్చుంటే? తప్పేమిటి? నీ ఎక్కు వేమిటి? నా తక్కువేమిటి? ఆ మాటకు వస్తే ఇది మా ఇల్లు!" అన్నది.

"ఇల్లు నీది కావచ్చు. కాని నీ భర్త మీద నా భర్త అధికారి," అన్నది రామ భద్రుడి భార్య.

ఆ మాట విని హరి భార్య, "నీ భర్త మా భర్తలకు అధికారి కావచ్చు, కాని నువు మా అధికారివి కావు. ఆ విషయం గుర్తుంచుకుని మాట్లాడు," అన్నది. ఆమెకు కూడా రామభద్రుడి భార్యను చూస్తే అరికాలిమంట నెత్తికెక్కుతున్నది.

రామభద్రుడి భార్య అప్పటికేమీ చెయ్యలేక, తన భర్త రాగానే, అతనితో హరి, గిరి భార్యల మీద చిలవలూ, పలవలూ కల్పించి చెప్పేసింది.



రామభద్రుడికి చాలా కోపం వచ్చి, హరినీ, గిరినీ పిలిచి సంజాయిషీ అడిగాడు. వాళ్ళు తమ భార్యల నుంచి జరిగినదంతా తెలుసుకుని, రామభద్రుడితో, "ఇందులో మా వాళ్ళ తప్పేమీ లేదండీ. మీరు మా మీద అధికారం చెయ్యటం సబబుగాని, మీ భార్య మావాళ్ల మీద అధికారం చూపటం సబబు కాదు గదా?" అన్నారు.

ఈ మాటకు రామభద్రుడు మరింత మండిపడి, "నా భార్య మీ భార్యలకు అధికారి కాకపోవచ్చు, కాని నాకు అధికారే! ఆమె నిర్ణయాన్నిబట్టి నేను మీ ఇద్దరినీ ఉద్యోగాల నుంచి తొలగించు తున్నాను," అన్నాడు.

హరీ, గిరీ ఎంత నచ్చచెప్ప యత్నించినా ఆయన వినిపించుకోలేదు.

రామభద్రుడు వెళ్ళిపోయాక జరిగిన సంగతి ఊళ్ళోవాళ్ళకు తెలిసింది. వాళ్లు ఒక మనిషిని రాజుగారి వద్దకు పంపి, జరిగినది తెలియబరిచారు. ఆ కబురు నిజమేనని ప్రచండ మహారాజు చారుల ద్వారా రూఢి చేసుకున్నాడు.

ఆ నెల రామభద్రుడికి జీతం అంద లేదు. ఆయన కంగారుపడి కోశాధికారిని అడిగితే, "నా కేమీ తెలియదు. వెళ్ళి రాజుగారిని అడుగు," అన్నాడు కోశాధికారి.

రామభద్రుడు రాజదర్శనం చేసుకుని తన జీతం మాట అడిగాడు.

"ఇంత కాలమూ నువు నా అధికారంలో పని చేస్తున్నావనుకున్నాను. నీ అధికారి నేను కాననీ, నీ భార్య అనీ ఇటీవలే తెలియవచ్చింది. నీ జీతం సంగతి నీ భార్యనే అడుగు. మళ్ళీ నా వద్దకు వచ్చావంటే నువు ఇంత కాలమూ తీసుకున్న పాత జీతమంతా వసూలు చెయ్యగలను. వెళ్ళు!" అన్నాడు రాజు.

రామభద్రుడికి ఉద్యోగం పోయింది. అప్పటికే హరీ, గిరీ తమ పదవులను రాజు నుంచి తిరిగిపొందారు.





# నకిలీ హారం

ఒక అగ్రహారంలో రామావధాని అనే పండితుడు పిల్లలకు చదువు చెప్పి, వారిచ్చే దక్షిణలతో జీవయాత్ర సాగించే వాడు. ఆయన భార్య మీనాక్షి చాలా రోజులకు పుట్టింటి మీద మనసు మళ్ళి, తన భర్తతో చెప్పింది.

"నువ్వు వెళ్లు. నేను కూడా బయలు దేరితే పిల్లల చదువు పాడవుతుంది. అదీగాక ఖర్చు కూడా ఎక్కువవుతుంది," అన్నాడు రామావధాని.

"పోనియ్యండి. కాని పెళ్లి అయినాక మీరు నాకు ఒక్క నగ అయినా చేయించ లేదంటే మావాళ్ల దగ్గిర నాకు చిన్నతనంగా ఉంటుంది. అందుకని, నేను బయలు దేరేలోగా ఒక హారం చేయించి పెట్టండి," అన్నది మీనాక్షి.

"నా పరిస్థితి నీకు తెలుసుగదా! బడి పిల్ల లిచ్చేది మన ఖర్చులకు బొటా బొటీగా సరిపోతున్నది. నగలకూ, నాణ్యాలకూ ఎక్కడ నుంచి తేగలను?" అన్నాడు భర్త.

"కావడిపెట్టెలో మా అమ్మవి వెండి కడియాలు పడి ఉన్నాయి. అలాటి మోటు నగలు నేను పెట్టుకోను. అవి అమ్మేసి, ఆ డబ్బుతో హారం చేయించండి." అన్నది మీనాక్షి.

మర్నాడు రామావధాని పట్నం వెళ్లి, వెండి కడియాలు ఒక నగల దుకాణంలో అమ్మి, వాటికి బదులు ఒక బంగారు హారం ఇయ్యమని దుకాణం యజమానిని అడిగాడు.

"కడియాల ధరకు అసలు బంగారం నగ ఏదీ రాదు, బాబూ. కావలిస్తే కొత్తగా వస్తున్న మాయ బంగారం హారం తీసు కోండి. రంగు అచ్చంగా బంగారం లాగే ఉంటుంది, రంగు చెడదు. హారంతో

"రత్న"

బాటు మీకు కొంత డబ్బు తిరిగి వస్తుంది కూడా," అన్నాడు దుకాణంవాడు.

అతను చూపిన హారం చాలా అందంగా ఉన్నది. రామావధాని దాన్ని తీసుకు పోయి భార్యకిచ్చి, "ఇప్పటికి ఇది వేసుకో. ఈసారి నువు పుట్టింటికి వెళ్ళే లోపల కొంత డబ్బు కూడబెట్టి, అసలు బంగారు నగ చేయించుకుందువుగాని," అన్నాడు.

"నేను మా వాళ్ళతో ఇది బంగారు హారమనే చెబుతాను. మీరు కూడా అందరితోనూ అలాగే చెప్పండి," అన్నది మీనా[illegible] శర్మతో.

కా[illegible]రా[illegible] [illegible]న చాలా కాలానికి పుట్టింటి గడ[illegible] [illegible]్కన మీనాక్షిని ఆమె అన్న మాధవుడూ, అతని భార్య రుక్మిణీ ఎంతో ఆదరంతో చూశారు. రుక్మిణి తన ఆడబడుచు మెడలో తళతళా మెరిసే హారాన్ని చూసి మెచ్చుకుని, ఎప్పుడు చేయించుకున్నావని అడిగింది.

"ఈ మధ్యనే, వదినా! మా ఆయన దగ్గిర చదువు పూర్తి చేసుకుని, జమీందారు గారబ్బాయి గురుదక్షిణ ఇచ్చి వెళ్ళాడు. మా ఆయన ఆ డబ్బుతో నాకు నగ చేయించాలని పట్టుబట్టి, వద్దు మొర్రో అంటున్నా వినకుండా, నేనిక్కడికి ప్రయాణ మవుతూండగా చేయించారు," అని మీనాక్షి కథ అల్లి చెప్పింది అతికేలాగా.

ఆ హారం చూసినప్పటినుంచీ తనకు కూడా అటువంటిది ఉంటే బాగుంటుం



దని తహ తహ లాడుతూ, ఆ రాత్రి తన భర్తను అడిగింది రుక్మిణి.

మాధవుడు ఎక్కువ చదువు కున్న వాడు కాడు. తాత, తండ్రులు సంపాదించిన కొద్దిపాటి పొలం సొంతాన సాగు చేస్తూ, భార్యా, పిల్లలతో గుట్టుగా సంసారం చేస్తున్నాడు. ఆ మాటే అతను అంటే రుక్మిణి కుంగిపోయింది.

అది చూసి మాధవుడు, "పోనీ రేపు పట్నం వెళ్ళి, ధాన్యం అమ్మిన డబ్బు వసూలు చేసి, దానితో నీకు హారం తెస్తాను," అన్నాడు.

కాని అతను తీరా డబ్బు వసూలు చేసుకుని, నగల దుకాణానికి వెళ్లి, బంగారు హారాలు బేరం చేస్తే, ఏడాది పొడుగునా రావలసిన డబ్బులో చాలా భాగం హారానికే పోయేటట్టున్నది. సంవత్సరం ఎలా గడిపేటట్టు?

"అందమైన మాయ బంగారం హారం ఉన్నది. చాలా చౌక, చూస్తారా" అన్నాడు నగల వర్తకుడు.

అతను చూపిన హారాలు చూసి మాధవుడు నిర్ఘాంతపోయాడు. అందులో ఒక అచ్చు మీనాక్షి కొన్న దానిలాగే ఉన్నది. కాకపోతే మీనాక్షిది బంగారందిట, ఇది మాయ బంగారంది. కాని రెంటికీ తేడా ఎవరూ కనిపెట్టలేరు.

మాధవుడు సంకోచించకుండా ఆ మాయ బంగారం హారం కొనేసి, సంతోషంగా ఇంటికి వచ్చాడు.



భర్త తెచ్చిన హారాన్ని చూడగానే రుక్మిణి, అది మీనాక్షి హారంలాగా ఉండటం గమనించి చాలా ఆనందించింది. అయితే ఇది అసలు బంగారం కాదని మాధవుడు రుక్మిణికి దాచకుండా చెప్పేశాడు. వచ్చే ఏడు ఎవరి పొలమన్నా కౌలుకు తీసుకుని, డబ్బు కూడబెట్టి మంచి బంగారం హారం చేయించి పెట్టు తానని అతను భార్యకు అప్పటి కప్పుడు మాట ఇచ్చాడు.

మీనాక్షితో సమంగా తనకు కూడా హారం అమరింది గదా అని రుక్మిణి సమాధాన పడింది.

మీనాక్షి కూడా రుక్మిణి హారం చూసి, తన హారంలాగే ఉన్నందుకు ఆశ్చర్య పడింది గాని, అది నిజమైన బంగారం అనుకుని ఈర్ష్యపడింది.

ఆ రోజల్లా రుక్మిణీ, మీనాక్షీ కూడా ఒకరిని చూసి ఒకరు లోపల అసూయ పడుతూనే గడిపారు. ఆ రాత్రి ఇద్దరికీ నిద్రలేదు.

తెల్లవారి పండగ. రుక్మిణి పిల్లలకు తలంటి పోసి, కొత్త బట్టలు కట్టి, తాను తలంటి స్నానం చెయ్యటానికి ఉపక్రమించింది. అదే సమయం అనుకుని మీనాక్షి తన హారాన్నీ, రుక్మిణి హారాన్నీ మార్చేసింది.

అలాగే మీనాక్షి స్నానం చేసేటప్పుడు రుక్మిణి మళ్లీ రెండు హారాలనూ మార్చేసింది. ఎవరి హారాలు వారి వద్దనే ఉన్నా, తమ నకిలీ హారాలు పోయి బంగారు హారాలు వచ్చాయన్న సంతృప్తి ఇద్దరికీ కలిగింది. పండగ పరమానందంగా గడిచి పోయింది. మీనాక్షి ఇంటికి వచ్చేసింది.

మరుసటి ఏడు రుక్మిణి తనను బంగారు హారం గురించి జ్ఞాపకం చెయ్యనందుకు మాధవుడు ఎంతో సంతోషించి, ఆమెకు ఆ సంగతి జ్ఞాపకం చెయ్యలేదు.

అలాగే రామావధాని మరుసటేడు మీనాక్షి బంగారు హారం గురించి తనకు జ్ఞాపకం చేస్తుందేమోనని భయపడి, అలా జరగనందుకు ఆశ్చర్యపోయాడు.





# నారదుడు

సప్తర్షుల జాబితాలు ఏడు ఉన్నట్టు చెబుతారు. అందులో ఒక జాబితాలో నారదుడున్నాడు; అతని వెంట ఈ సప్తర్షి గణంలో సంవర్తుడూ, మేరుసావర్ణుడూ, మార్కండేయుడూ, సాంఖ్యుడూ, యోగీ, దుర్వాసుడూ ఉన్నారు. నారదుడు దేవర్షిగా పురాణాలలో కనిపిస్తాడు. అతను బ్రహ్మకు పుట్టాడు. దక్షుడి కూతుళ్ళలో ప్రియ అనేదానికీ, బ్రహ్మకూ ఇతను పుట్టినట్టు ఒక కథ ఉన్నది. అలాగే ఇతను బ్రహ్మచారిగా ఉండిపోయినట్టు వాడుకలో ఉన్నది. కాని నారదుడు గృహస్థు కావటానికి యత్నించకపోలేదు. అతను సృంజయుడనే రాజు కూతురిని, సుకుమారి అనే దాన్ని ప్రేమించి, పెళ్లాడినట్టు ఒక కథ ఉన్నది.

నారదుడు అంటే ''నీరు ఇచ్చేవాడు'' (మేఘం) అని అర్థం. ఇతను ఒక చోట నిలకడగా ఉండక లోకసంచారిగా అస్తమానమూ తిరుగుతూ ఉంటాడనీ, ఒక చోటినుంచి మరొక చోటికి వార్తలు చేరవేస్తూ ఉంటాడనీ, మహతి అనే వీణ మీద పాడుతూంటాడనీ, దేవతల మనిషే అయినా దానవులతో కూడా సఖ్యంగా ఉంటాడనీ, తంపులుపెట్టి ఆనందిస్తాడనీ నారదుణ్ణి గురించి వింటాం. నారదుడు కలహాశనుడూ, కలహభోక్తా అన్న ప్రఖ్యాతి ఉన్నది. జలంధరుడికి పార్వతిపై ఆశపుట్టించి, తద్వారా శివుడితో యుద్ధం తెచ్చిపెట్టి, జలంధరుడి చావుకు నారదుడు కారకుడైనట్టు కథ ఉన్నది. అలాగే నారదుడు గరుత్మంతుణ్ణి కద్రువ కొడుకులైన పాముల మీదికి రెచ్చగొట్టినట్టు కూడా కథ ఉన్నది. కాలయవనుణ్ణి కృష్ణుడి పైకి రెచ్చగొట్టి చంపించినది కూడా నారదుడే.

నారదుడి గానం గురించి ఒక విచిత్రమైన కథ ఉన్నది.

సంగీతానికి తుంబుర, నారదులను ప్రసిద్ధిగా చెబుతారు. నిజానికి తుంబురుడు నారదుడికి ఏమీకాడు. అతను గంధర్వుడు. అతను కళావతి అనే వీణ వాయిస్తూ పాడేవాడు.

కౌశికు డనే వాడు స్వర్గంలో గానం చేస్తూండగా అక్కడికి లక్ష్మి, ఆమె పరిచారికలూ, నారదుడూ, తుంబురుడూ వచ్చారు. లక్ష్మి తుంబురుడి పై అభిమానం ఉంచి, కౌశికుడితో సహా అతన్ని కూడా గానం చెయ్యమని, బహుమతి కూడా ఇచ్చింది. నారదుడికి తీరని అవమానం కలిగింది.

విష్ణువు నారదుణ్ణి ఊరడించి, నీకు గాన ప్రావీణ్యం కావాలంటే, మానసోత్తర పర్వతం మీద గానబంధుడు అనే గుడ్లగూబ ఉన్నదనీ, దాని దగ్గిర సంగీతం నేర్చుకోమనీ చెప్పాడు. నారదుడు ఆ ప్రకారమే గుడ్లగూబ వద్దకుపోయి, సంగీతం నేర్చుకుని, తరవాత కొంత కాలానికి తుంబురుడితో పోటీపడి ఓడిపోయాడు.

మరొకసారి పరాభవంపొంది నారదుడు విష్ణువు వద్దకు వెళ్ళి, తనకు జరిగిన అవమానం గురించి చెప్పుకున్నాడు.

''నేను కృష్ణుడుగా అవతరించినప్పుడు నా వద్ద నువు సంగీతం నేర్చుకో,'' అని విష్ణువు చెప్పాడు.

ఆవిధంగానే నారదుడు కృష్ణుడి వద్ద సంగీతం నేర్చుకుని సంగీతంలో పరిపూర్ణత్వం సంపాదించాడు.

నారదుడికి పర్వతు డనే మేనల్లుడు ఉండేవాడనీ, ఇద్దరూ కలిసి లోకసంచారం చేసేవారనీ చెబుతారు. పర్వతుడు నారదుడికి ఎలా మేనల్లుడవుతాడో తెలియదు. పర్వతుడు అనే పేరుకూడా నారదుడిదే నని కొందరు చెబుతారు.

నారదపర్వతులు కలిసి లోకసంచారం చేసేవారట; వారిమధ్య ఎలాంటి రహస్యాలు లేవట!



# అంబరీషుడు



నాభాగుడి కొడుకైన అంబరీషుడు గొప్ప విష్ణుభక్తుడు. అతని భక్తికి మెచ్చి విష్ణువు అతనికి తన సుదర్శన చక్రాన్ని ఇస్తానన్నాడు. కాని అంబరీషుడికి దానితో ఎన్నడూ ఉపయోగం కలగలేదు.

అంబరీషుడు అనేక అశ్వమేధయాగాలు చేశాడు. యాగాలు ముగిసినప్పుడు అంతులేని దానధర్మాలు చేసేవాడు.







ఒకసారి అంబరీషుడు ఏకాదశి ఉపవాసం ఉండి, ద్వాదశి ఘడియలలో భోజనానికి కూర్చున్నాడు.



అంతలో దుర్వాసుడు వచ్చినట్టు తెలిసింది. అంబరీషుడు తన భోజనం ముందు నుంచి లేచి. దుర్వాసుడికి స్వాగతం చెప్పి, భోజనానికి ఆహ్వానించాడు. స్నానం చేసి వస్తానని దుర్వాసుడు నదికి వెళ్ళాడు.



కాని ఎంతసేపటికీ అతిథి రాలేదు. ద్వాదశి ఘడియలు దాటిపోతున్నాయి. పారణ చెయ్యాలి, కాని అతిథిని వదిలి తాను తినలేక, అంబరీషుడు జలపానం చేశాడు.



సరిగా ఆ సమయంలో దుర్వాసుడు వచ్చి, "నాకు పెట్టకుండా ఉపవాస భంగం చేస్తావా?" అని మండి పడ్డాడు.

దుర్వాసుడు తన జటను ఒక దాన్ని పెరికి, నేలకేసి కొట్టేసరికి మహాకృత్య పుట్టి, అంబరీషుడి పైకి వచ్చింది.







ఆ క్షణంలో అంబరీషుడు సుదర్శన చక్రాన్ని స్మరించాడు. ఆ చక్రం మహా కృత్యను చంపేసింది.



రాక్షసుణ్ణి చంపిన సుదర్శన చక్రం దుర్వాసుడి వెంట పడింది. దాన్ని ఆప టానికి దుర్వాసుడి తపశ్శక్తి చాలలేదు.



దుర్వాసుడు పారిపోయి అరణ్యంలో దాక్కున్నాడు. సుదర్శన చక్రం తాకిడికి అరణ్యంలో కార్చిచ్చుపుట్టింది. దుర్వాసుడు సముద్రంలో దాగాడు. చక్రం సముద్రంలో ప్రవేశించి కల్లోలం పుట్టించింది.



ఎక్కడా రక్షలేక దుర్వాసుడు వెళ్ళి, రక్షించమని విష్ణువు కాళ్ళు పట్టుకున్నాడు. అంబరీషుణ్ణి శరణువేడమని విష్ణువు సలహా ఇచ్చాడు.



దుర్వాసుడు వెళ్ళి అంబరీషుణ్ణి శరణుజొచ్చాడు. అప్పుడు గాని సుదర్శన చక్రం దుర్వాసుణ్ణి వదిలిపెట్టలేదు. ఒక సజ్జనుడి మంచితనంతో ఒక దురహంకారికి బుద్ధివచ్చింది.



# భరతుడు

పురాణాలలో భరతుడు పేరు గలవాళ్లు చాలామంది కనబడతారు. ఒక భరతుడికి తక్షుడూ, పుష్కలుడూ అని ఇద్దరు కొడుకు లుండేవారు. అతను యుద్ధం చేసి జయించి, రెండు నగరాలు నిర్మించి వాటికి తన కొడుకు లిద్దరినీ రాజులు చేశాడు. తక్షుడి కొడుకు ఏలిన నగరం తక్షశిల. అది చరిత్ర ప్రసిద్ధమైనది. ఒకప్పుడు అది ఉండిన ప్రాంతాన్ని గంధర్వదేశం అనేవారు. పుష్కలుడు పాలించిన నగరం, పుష్కలావతి, గాంధారదేశంలో ఉండేది.

రామాయణంలో దశరథుడికి కైకయందు కలిగిన కొడుకు పేరు కూడా భరతుడే. అతడి కథ రామాయణం ద్వారా ప్రసిద్ధి కెక్కింది.

మరొక భరతుడు ఋషభుడికీ, జయంతికీ పుట్టిన కొడుకులలో ఒకడు. అతని సోదరులు కుశావర్తుడూ, ఇలావర్తుడూ, బ్రహ్మావర్తుడూ, ఆర్యావర్తుడూ, మలయకేతుడూ, భద్రసేనుడూ, విదర్భుడూ అనేవాళ్లు. ఈ భరతుడి వల్లనే మన దేశానికి భారతదేశం అనే పేరు వచ్చిందనీ, ఇతని సోదరులు మన దేశంలో వేరు వేరు ప్రాంతాలు పాలించారనీ, వారి పేర్లే ఆ ప్రాంతాలకు వచ్చాయనీ చెబుతారు. భరతుడు పాలించిన దేశం పేరు అజనాభం.

ఈ భరతుడు గొప్ప భూతదయ గలవాడు. ఇతను చాలా కాలం రాజ్యం చేసి, రాజ్యాన్ని తన కొడుకులకు ఇచ్చి, తపస్సు చేసుకోవటానికి వనానికి వెళ్ళాడు. ఒకనాడు ఇతను నదిలో స్నానం చేస్తూండగా, ఒక చూడి లేడి ఆ నదికే వచ్చి నీరు తాగసాగింది. ఆ సమయంలో మబ్బులు కమ్మి, గాఢాంధకారమైపోయి,

భయంకరంగా ఉరిమింది. ఆ లేడి భయపడి అక్కడే ప్రసవించి, ప్రాణాలు వదిలింది. వృద్ధుడైన భరతుడు ఆ లేడి పిల్లను చూసి జాలిపడి, దాన్ని తన ఆశ్రమానికి తెచ్చి, ఎంతో ప్రేమతో పెంచుతూ, దాని మీద అమితమైన మమకారం పెట్టుకుని, చచ్చిపోయే క్షణంలో కూడా దాన్నే తలుచుకుంటూ చచ్చిపోయి, ఆ కారణంగా లేడిగా పుట్టాడట!

ఈ భరతులు గాక జడభరతుడనేవాడు మరొకడున్నాడు.

కాని బాలుడుగా ప్రసిద్ధి కెక్కినవాడు శకుంతల కొడుకైన భరతుడు. మేనకా, విశ్వామిత్రులు కని పెంచి పారేసిన శకుంతలను పక్షులు పెంచుతూంటే, కణ్వమహాముని ఆ పిల్లను తెచ్చి తన ఆశ్రమంలో తన కూతురిలాగే పెంచి పెద్ద చేశాడు.

ఒకసారి దుష్యంతుడు అనే రాజు వేటాడుతూ కణ్వమహాముని ఆశ్రమానికి వెళ్ళి, అక్కడ శకుంతలను చూసి మోహించి, ఆమెను గాంధర్వ విధిని పెళ్ళాడి, తన దారిన తాను వెళ్ళాడు. ఆశ్రమంలోనే శకుంతల భరతుణ్ణి కన్నది.

ఆ కుర్రవాడు చిన్నతనం నుంచీ కూడా అన్ని జంతువులనూ పట్టుకుని కట్టేసేవాడు. అందుచేత వాణ్ణి అందరూ 'సర్వదమనుడు' అని పిలిచేవారు. వాడు ఆశ్రమంలోనే సమస్త శాస్త్రాలూ నేర్చుకున్నాడు.

వాడు పెద్దవాడయాక కణ్వుడు శకుంతలనూ, ఆమె కొడుకునూ దుష్యంతుడి వద్దకు పంపాడు. దుష్యంతుడు ఆ కుర్రవాణ్ణి తన కొడుకు కాదనేశాడు. అప్పుడు ఆకాశవాణి, ''వీడు నీ కొడుకే. వీణ్ణి నువు భరించు,'' అని ఆదేశించింది. ఆ కారణంగా ఆ కుర్రవాడికి 'భరతుడు' అన్న పేరు వచ్చిందట.

భరతుడికి ముగ్గురు భార్యలు. వారికి పిల్లలు కలిగారుగాని చచ్చిపోయారు. అందుచేత అతను భరద్వాజుణ్ణి పెంచుకున్నట్టు భాగవతం చెబుతున్నది.






పూర్వం విదర్భదేశాన్ని విజయపాలుడనే రాజు పాలించాడు. ఆయన శౌర్య పరాక్రమాలను గురించి దేశదేశాల వారు కట్టు కథలుగా చెప్పుకొనేవారు; పాటలు కట్టి పాడుకొనేవారు. కారణమేమంటే ఆయన ఎన్నడూ రణరంగంలో అపజయం ఎరగడు. చుట్టుపక్కల దేశాలలో ఆయనతో యుద్ధం చేసి ఓడిపోని రాజు అంటూ లేడు.

విజయపాలుడికి కుమారులు లేరు. జలజాదేవి అనే ఒక కుమార్తె మాత్రం ఉంది. ఆమెకు యుక్తవయసు వచ్చింది. కాని, తన వంటి పరాక్రమవంతుడి కుమార్తెను పెళ్ళాడదగిన పరాక్రమశాలి ఎక్కడా లేడనే అనుమానంతో విజయపాలుడామెకు వివాహ ప్రయత్నం చేయలేదు. జలజను పెళ్ళాడాలన్న అభిలాష చాలా మంది రాజకుమారులకు ఉన్నా విజయపాలుడి మీద కత్తి గట్టి యుద్ధంలో ఓడిపోవటంకన్న ఊరుకోవటమే మంచిదనుకున్నారు.

అయితే జయపురం యువరాజు మాణిభద్రుడనేవాడు విజయపాలుడి మీద దండెత్తటానికి పూనుకున్నాడు. మాణిభద్రుడి తండ్రి పూర్వం విజయపాలుడి చేత ఓడిపోయాడు. అందుకే అతను చిన్నతనం నుంచీ యుద్ధవిద్యలో ప్రత్యేక శిక్షణ పొంది, వ్యూహరచనలోనూ, అస్త్ర శస్త్ర ప్రయోగాలలోనూ అనేక రహస్యాలు తెలుసుకున్నాడు. విజయపాలుణ్ణి ఓడించి జలజను పెళ్ళాడాలని మాణిభద్రుడి ఆశయం.

మాణిభద్రుడు తన సైన్యాలతో విదర్భపైకి దండెత్తివచ్చే సమయానికి విజయపాలుడు రోగగ్రస్తుడై మంచంపట్టి ఉన్నాడు. వార్ధక్యం సమీపించటంచేత రాజవైద్యులు



ఈ విధంగా కొద్దిరోజులు గడిచింది. యుద్ధభూమిలో విదర్భ సేనలకు అపజయం హెచ్చుతోంది. దానితోబాటు మహారాజు వ్యాధికూడా హెచ్చుతోంది. ఇక మహారాజుకు వాస్తవ యుద్ధవార్తలు తెలపటం ప్రమాదకరమని మహామంత్రి నిశ్చయించి ఆయనతో అబద్ధాలు చెప్ప సాగాడు. ఎలాగయినా మహారాజు మరో అరవై గడియలు దాటి బ్రతకడని రాజ వైద్యుడు గట్టిగా చెప్పేశాడు. రెండు రోజులలో మాణిభద్రుడికి సంపూర్ణ విజయం సమకూరేలాగే ఉన్నది. ఈ లోపుగా మహారాజుకు అపజయవార్త లెందుకు తెలపటం? మహారాజును అకారణంగా దేనికి ఖేదపెట్టాలి?

చేసే చికిత్సకూడా అంతగా గుణమివ్వటం లేదు. ఈ జబ్బుకు తగ్గట్టే యుద్ధం వచ్చిపడటంతో విజయపాలుడి ఆరోగ్యం మరింత పాడయింది. తాను స్వయంగా యుద్ధరంగంలోకి వెళ్లి ఆఖరు విజయం సాధిస్తానని రాజు లేచాడు. మంత్రులూ, వైద్యులూ మహారాజును ఈ ప్రయత్నం నుంచి మళ్లించగలిగారే గాని ఇందువల్ల ఆయనకు మనను మరింత కల్లోలిత మయింది. రాత్రింబవళ్ళు యుద్ధవార్తలు వినేవాడు. శత్రు వ్యూహాలకు ప్రతి వ్యూహాలు చెప్పి మనుషులను యుద్ధ రంగానికి పంపేవాడు. తన ప్రతివ్యూహాలు భగ్నమైనట్టు తెలిసి క్రుంగిపోయేవాడు.

''మహారాజా, ఇన్నాళ్లకు మన సేనలు శత్రుసేనల ధాటికి ఎదురునిలిచి పోరాడు తున్నాయి. శత్రు సేనలలో కల్లోకం బయలుదేరింది!'' అన్నాడు మహామంత్రి. అంత నీరస స్థితిలో కూడా మహారాజు చిరునవ్వు నవ్వాడు. ఒక్క నిట్టూర్పు విడిచి ఆయన కాసేపు కన్ను మూశాడు.

ఇంతకూ మహామంత్రి అంచనాలూ, రాజవైద్యుడి అంచనాలూ తప్పాయి. అరవై ఘడియలు దాటిపోయాయి. రాజు యింకా జీవించే వున్నాడు. యుద్ధం

మటుకు అవసాన దశకు వస్తోంది. రాజు కళ్ళుతెరిచి బలహీనంగా యుద్ధ వార్తలేమని అడిగాడు.

''మహారాజా! విజయలక్ష్మి మననే వరించనున్నది. శత్రువు ఏ క్షణాన అయినా సంధికి యాచించవచ్చు.'' అన్నాడు మంత్రి. ముందు రాజు మరణిస్తాడా, ముందు శత్రువులు కోట ప్రవేశిస్తారా అన్నది పెద్ద ప్రశ్న అయిపోయింది. మహారాజు మరణించిన మరు క్షణం ఏం జరిగినా మంత్రికి అంత బాధ లేదు. కాని అదే జరగలేదు. అక్కడ మాణిభద్రుడు తన సేనలతో కోట ముఖ ద్వారం ప్రవేశించే అలికిడికి రాజు కళ్ళు తెరిచి, ''మనం గెలిచామా? ఏమిటా కోలాహలం?'' అని అడిగాడు.

''మహాప్రభూ! మన సేనలు విజయ ధ్వానాలు చేస్తూ రణరంగం నుండి తిరిగి వస్తున్నాయి!'' అన్నాడు మంత్రి.

''నాకు ముందే తెలుసు! నాకు అపజయం లేదు,'' అంటూ రాజు తిరిగి కన్ను మూశాడు.

కొద్ది సేపటిలో రాజభవనాలూ, రాజాంతఃపురమూ మాణిభద్రుడు వశ పరచుకుని దర్బారు ఏర్పాటుచేయించి విదర్భ మంత్రులనూ, సేనాధిపతులనూ రమ్మని ఆజ్ఞాపించాడు. వెళ్ళక తప్పేది



లేదు. మహామంత్రి, రాజుగారి వేలినుంచి మెల్లిగా రాజముద్రిక తీస్తూండగా మహారాజు కళ్ళు తెరిచి, ''ఏమిటిది?'' అని అడిగాడు.

''మహాప్రభూ, ఓడిపోయిన శత్రువులతో సంధి నెరపబోతున్నాము. సంధి పత్రం మీద రాజముద్ర వేయాలికద,'' అన్నాడు మంత్రి.

అకస్మాత్తుగా రాజుకు కొత్త శక్తి వచ్చినట్టయింది. ఆయన మంత్రి సహాయంతో లేచి కూచుని, ''సభకు నేనే వస్తున్నాను. అన్ని ఏర్పాట్లూ చేయించు,'' అన్నాడు.

మహామంత్రికి మతి పోయినట్టయింది. ఏమి చెయ్యటానికీ తోచక ఆయన, "చిత్తం

మహాప్రభో!'' అంటూ గబగబా దర్బారుకు వెళ్లాడు. అక్కడ అప్పుడే మాణిభద్రుడు సింహాసనం మీద అధిష్ఠించి ఉన్నాడు. సంధిపత్రం వ్రాస్తున్నారు.

'' మహాప్రభూ! ఒక్క మనవి!'' అని మహామంత్రి మాణిభద్రుడికి జరిగినదంతా విపులంగా విన్నవించుకున్నాడు. '' మహారాజు గారు మరొక్క గడియ— తప్పితే రెండు గడియలు!— అంతకు మించి జీవించరు. వారికి నిజం తెలియకుండా కాపాడినట్లయితే నేనూ, మా విదర్భ ప్రజలూ యావజ్జీవం తమకు కృతజ్ఞులమై ఉంటాం,'' అని మహామంత్రి ప్రాధేయపడ్డాడు. మాణిభద్రుడు మొదట ఆగ్రహించినా, యువకుడు గనక, వినోదం చూద్దామని, చివరకు అంగీకరించాడు.

ఈ సమయానికే, సేవకులు పట్టుకొని నడిపిస్తూండగా అంతఃపురం నుంచి మహరాజు వచ్చాడు, తన సింహాసనంలో కూర్చున్నాడు, పక్కనే చేతులు కట్టుకు నిలబడిన మాణిభద్రుణ్ణి చూశాడు.

'' నాయనా, మంచి యోధుడివి! చక్కని వ్యూహరచన చేశావు, మంచంలో ఉండికూడా నేనే స్వయంగా ప్రతి వ్యూహం నడపటంచేత ఓడావుగాని, లేకపోతే గెలవదగినవాడివి. నాతో ఓడిపోవటం నీకు అగౌరవం కాదు, నీతో గౌరవనీయమైనసంధిచేస్తాను. నాకుమార్తెనిచ్చి వివాహం చేస్తాను. నువు ఓడిపోయినా నా రాజ్యం నీదే!'' అన్నాడు మహారాజు నవ్వుతూ.

మాణిభద్రుడు మొదట నివ్వెరపోయినాడు, కాని సభలోకి వచ్చిన జలజను చూడగానే అతనికి ఎదురుచెప్ప బుద్ధి కాలేదు. ఇద్దరికీ మహా వైభవంగా వివాహం జరిగింది.

కొద్దికాలానికి వారికొక మగశిశువు కూడా కలిగాడు. వృద్ధమహారాజు మనవణ్ణి ఎత్తుకొని ఆడిస్తూ మురిసిపోయేవాడు. చివరవరకూ ఆయన తన సైన్యాలు యుద్ధంలో ఓడిపోయాయనే సంగతి ఎరగనే ఎరగడు.



# ఉపకారి

శిశ్నంగేరి గ్రామానికి వరద వచ్చింది. గ్రామస్థులందరూ గ్రామం విడిచి, సురక్షిత ప్రాంతానికి వెళ్ళిపోతున్నారు. అక్కడికి పోవాలంటే పడవ మీద నది అవతలికి వెళ్ళాలి. ఒకే ఒక పడవ ఉండటంచేత అందరూ అందులోకి ఎక్కారు. అయితే సోమయ్యా అనే పిసినారి ధనికుడూ, ఒక బిచ్చగాడూ మిగిలిపోయారు. సోమయ్యా తన సంపదలో ఒక్క నల్లపూస కూడా వదలకుండా పోగు చేసుకుని బయలుదేరడంవల్ల జాప్యం జరిగింది. చివరకు వచ్చిన సోమయ్యా, బిచ్చగాడూ కూడా పడవ ఎక్కబోయారు.

కాని పడవవాడు, "ఇంకొక్క మనిషి కంటె పడవ ఎక్కటానికి వీల్లేదు. పడవ మునిగి పోగలదు. ఇద్దరిలో ఎవరిని ఎక్కించుకోవాలో పడవలోనివాళ్లే తేల్చండి," అన్నాడు.

"ఎవరికి ఏమీ ఉపయోగం లేనివాణ్ణి వదిలేస్తాం. బిచ్చగాణ్ణి ఎక్కించుకో," అన్నారు గ్రామస్థులు.

"గ్రామంలోకెల్లా ధనికుణ్ణి! నేను ఆ బిచ్చగాడికన్న ఉపయోగం లేనివాణ్ణా?" అని సోమయ్యా అడిగాడు.

"నిశ్చయంగా! ఆ బిచ్చగాడు మాకు బిచ్చం వేసి, పుణ్యం సంపాదించుకునేటందుకైనా ఉపయోగపడ్డాడు. నీ వల్ల ఎవరికి ఏం ఉపకారం జరిగింది?" అన్నారు పడవలో వాళ్లు.

—కోలార్ కృష్ణఅయ్యర్





# పేరు - ప్రతిష్ఠ

కొండయ్య పెద్దగా ఉన్నవాడు కాడు. అతనికి ఉద్యోగం కూడా లేదు. కూర్చుని తింటే జరుగుబాటు కాదని, అతని భార్య ఏదన్నా వ్యాపారం చెయ్యమని పోరు పెట్టింది. వ్యాపారం చెయ్యాలన్నా కొండయ్య దగ్గిర పెద్ద ఎత్తున మదుపు పెట్టటానికి తగినంత లేదు; రెండువందల రూపాయలున్నాయి.

అంత చిన్న మొత్తంతో ఏం వ్యాపారం చెయ్యవచ్చునా అని అతను ఆలోచిస్తూండగా, ఓ యాభైఏళ్ళవయసుగల మనిషి ఎండనపడి వచ్చి, మంచినీళ్లు అడిగింది. తరవాత ఆమె, కొండయ్య భార్య ఇచ్చిన మంచి నీళ్ళు తాగి, తనను పనికి సహాయంగా పెట్టుకోమనీ, తన పేరు అచ్చమ్మ అనీ చెప్పింది.

"మాకే జరుగుబాటు అంతంత మాత్రంగా ఉంటే నిన్ను కూడా ఎక్కడ భరించగలం? ఏదన్నా వ్యాపారం చేద్దామన్నా చేతినిండా డబ్బులేదు. కాకపోయినా మేం ఇద్దరమే. మాకు మరొకరి పని సహాయం దేనికి?" అన్నాడు కొండయ్య.

"నా కోసం మీరేమీ ఖర్చుపెట్టనక్కర్లేదు, మీతోపాటు ఇంత తినటానికి పెట్టండి. కొద్ది పెట్టుబడితో మంచి వ్యాపారం సాగించేటందుకు నేను సహాయపడతాను," అన్నది అచ్చమ్మ.

"ఏం వ్యాపారం?" అని కొండయ్య ఆసక్తిగా అడిగాడు.

"మంచి మామిడికాయలు వస్తున్నాయి. నేను అన్నిరకాల ఊరగాయలూ పెట్టగలను. మాటవరసకు, ఆవకాయ పెట్టటానికి ఎంతో పెట్టుబడి అక్కర్లేదు గదా? బాగా ఆలోచించుకోండి," అన్నది అచ్చమ్మ.

మాచిరాజు కామేశ్వరరావు

కొండయ్యకు ఈ ఆలోచన నచ్చింది. అతను తన దగ్గిర ఉన్న డబ్బుతో ఆవకాయకు కావలసిన సామగ్రి, అచ్చమ్మ చెప్పిన ప్రకారం తెచ్చాడు. అచ్చమ్మ ఆవకాయ పెట్టింది. ఆమె ఊరగాయలు పెట్టటంలో ఘటికురాలన టానికి సందేహం లేదు.

కొండయ్య ఆవకాయను సీసాలలో నింపి, తోపుడుబండి మీద పెట్టి, "అచ్చమ్మ ఆవకాయ! అచ్చమ్మ ఆవకాయ!" అంటూ నాలుగు వీధులూ తిరిగి అమ్మసాగాడు. త్వరలోనే సీసాలన్నీ అమ్ముడయాయి. కారణం ఏమంటే, కొన్న కొద్దిమందీ తృప్తిపడి, ఇంకా కావాలనటమేగాక, పదిమందికీ చెప్పారు.

మామిడికాయల తరుణం అయిపోయే లోపల అచ్చమ్మ ఊపిరి సలపకుండా మామిడి ఊరగాయలు పెట్టింది. వాటిని జనం ఎగరేసుకుపోయారు. కొండయ్యకు మంచి లాభం వచ్చింది.

మామిడికాయలు అయిపోయినా అచ్చమ్మ విరమించలేదు. ఆమె నిమ్మకాయలతోనూ, చింతకాయలతోనూ, ఉసిరికాయలతోనూ, ఎన్నో రకాల ఊరగాయలు పెట్టింది. "అచ్చమ్మ ఊరగాయలు!" అని అరుస్తూ కొండయ్య వాటిని ఉత్సాహంగా అమ్మాడు.

సంవత్సరం తిరిగే లోపల కొండయ్య ఊరగాయల పరిశ్రమ అమితంగా వృద్ధి పొందింది. అతను ఊరగాయల దుకాణం



పెట్టేశాడు. దుకాణం నిండా అరలు; వాటినిండా సీసాలలో రకరకాల ఊరగాయలు! అన్నిటి మీదా చీటీలు అంటించి, పెద్ద అక్షరాలలో ''అచ్చమ్మ ఊరగాయలు'' అని రాసి, దాని కింద చిన్న అక్షరాలలో ఊరగాయ పేరు రాసి పెట్టాడు. ఊరగాయలకు ఎక్కడలేని గిరాకీ వచ్చింది. అచ్చమ్మ పేరు మారు మోగింది.

అచ్చమ్మకు అంత పేరు రావటం కొండయ్య భార్య సహించలేక, ''వ్యాపారం నీది, పెట్టుబడి నీది! మధ్య అచ్చమ్మ పేరు దేనికి. 'కొండయ్య ఊరగాయలు' అని అమ్ము.'' అన్నది భర్తతో.

భార్య మాట వినటం అలవాటున్న కొండయ్య తన దుకాణంలో ఉన్న సీసాలన్నిటి మీదా పాత చీటీలు తీసేసి, కొత్త చీటీల మీద ''కొండయ్య ఊరగాయలు'' అని రాసి అంటించాడు. వెంటనే శాపం తగిలినట్టుగా కొండయ్య వ్యాపారం దెబ్బ తిన్నది. అచ్చమ్మ ఊరగాయల కోసం వచ్చినవాళ్ళు కొండయ్య ఊరగాయలు కొనటానికి ఉత్సాహం చూపలేదు. పేరు మారిందిగాని, అది అచ్చమ్మ ఆవకాయేనని కొండయ్య చెప్పి చూశాడు గాని, లాభం లేకపోయింది.

భార్య చాలా తెలివితక్కువ సలహా చెప్పిందని గ్రహించి, కొండయ్య ఊరగాయ సీసాల మీద చీటీలు మళ్ళీ మార్చి, వాటిని ''అచ్చమ్మ ఊరగాయలు'' చేసి, మళ్ళీ వ్యాపారాన్ని పుంజుకునేటట్టు చేశాడు.

అంతా సవ్యంగా సాగిపోతున్న సమయంలో అచ్చమ్మ కాస్తా చచ్చిపోయింది. తన బతుకుతెరువు పోయిందని కొండయ్య ఏడుస్తుంటే, భార్య సముదాయించి, ''అచ్చమ్మ పోతేనేం? అచ్చమ్మ పేరే మనకు కావలసింది. ఇంత కాలమూ అచ్చమ్మ దగ్గిర నేను అన్నిరకాల ఊరగాయలూ పెట్టటం నేర్చుకున్నాను.'' అన్నది

ఈసారి ఆమె మాట అక్షరాలా నిజమయింది.



# ఆకలి

ఈశ్వరయ్యకు నంది నమ్మినబంటు. వాడు ఈశ్వరయ్య ఏ పని చెప్పినా చేసేవాడు. కాని వాడికి ఆకలి మాత్రం అతిగా ఉండేది. ఎంత పెట్టినా వాడికి సరిపోయేదికాదు. అందుకని వాడు ఈశ్వరయ్య ఇంట్లో మాత్రమే గాక, తిండి పెట్టిన ఏ ఇంట్లోనైనా చాకిరి చేసేవాడు.

ఇది ఈశ్వరయ్యకు నచ్చక, వాడి ఆకలిని పోగొట్టితే, ఇంక చచ్చినట్టు తన ఇంట్లోనే పడి ఉంటాడనుకుని, స్వాములవారి దగ్గిరికి వెళ్ళి, తాత్కాలికంగా ఆకలిని పోగొట్టే ఉపాయం అడిగాడు. స్వాములవారు ఏదో పొడి ఇస్తే, దాన్ని నీళ్ళలో కలిపి నంది కిచ్చాడు ఈశ్వరయ్య.

అంతే! నంది పనిలోకి వెళ్ళడం మానేశాడు. ఆకలి లేకపోతే తిండి అక్కర్లేదు. తిండి అక్కర్లేకపోతే ఇంక పని చేయడ మెందుకు?

అసలుకే మోసం వచ్చిందని, ఈశ్వరయ్య విరుగుడు మందుకోసం మళ్ళీ స్వాములవారి దగ్గిరికి పరుగెత్తవలసివచ్చింది.

—(కుమారి) విస్సా రమాదేవి






రాజశేఖరుడు అనేవాడు మంచి వంశంలో పుట్టి కూడా, తన తల్లిదండ్రులతోబాటు ఆస్తి కూడా పోగొట్టుకుని, తక్షశిలకు వెళ్ళి, అక్కడ మంచి గురువు వద్ద వైద్య విద్య నేర్చుకుని, ఆ విద్యలో ఉత్తీర్ణుడై, రుద్రపురం అనే చిన్న పట్టణం చేరి, అక్కడ వైద్యవృత్తి ప్రారంభించాడు. త్వరలోనే అతనికి మంచిపేరు వచ్చింది. రామశర్మ అనే యువకుడు అతని వద్ద శిష్యుడుగా చేరి, వైద్యం నేర్చుకోనారంభించాడు.

ఒకనాడు కులశేఖరుడు అనే ఆయన తన కుమార్తె మోహిని అనే పిల్లను రాజశేఖరుడికి తెచ్చి చూపాడు. అప్పుడే యౌవనంలోకి అడుగు పెట్టుతున్న మోహిని చాలా చక్కనిది. తండ్రి ఆమె పెళ్లి చేసే ఆలోచనలో ఉండగా ఆమె కాలి మీద మచ్చలు కనిపించాయి. తండ్రి కంగారుపడి ఆమెను తెచ్చి రాజశేఖరుడికి చూపించాడు.

రాజశేఖరుడు మోహినిని పరీక్షించి, ఆమెకు కుష్ఠువ్యాధి సోకిందనీ, అది ఇంకా ప్రారంభ దశలోనే ఉన్నదనీ కులశేఖరుడికి తెలిపాడు. ఈ మాట విని కులశేఖరుడు ఎంతో బాధపడి, తన వంశ గౌరవం పోతుందనీ, మోహినిని ఎవరూ పెళ్ళాడరనీ ఆందోళన చెందాడు.

''ఇది మీకూ, నాకూ తప్ప మరెవరికీ తెలియనవసరంలేదు. మీరు కూడా మోహినికిగాని, మరొకరికిగాని ఏమీ చెప్ప వద్దు. రెండు సంవత్సరాలపాటు మందు పుచ్చుకుంటె వ్యాధి నయమవుతుంది. తరవాత ఆమెకు నిరభ్యంతరంగా వివాహం చేయవచ్చు,'' అని రాజశేఖరుడు కులశేఖరుడికి ధైర్యం చెప్పాడు. కులశేఖరుడి మనసు కుదుటపడ్డది.

రాజశేఖరుడు మోహినికి ఇచ్చే మందులు వేరే ఒక పెట్టెలో ఉంచి, దానికి తాళంవేసి, మూఢో కంటివాడికి తెలియకుండా మోహినికి చికిత్స చేస్తూ వచ్చాడు. మోహిని వ్యాధి క్రమంగా నయం కాసాగింది. రెండు సంవత్సరాల గడువు పూర్తికా వచ్చింది. ఆమె ఏ వ్యాధికి చికిత్సపొందుతున్నదీ రాజశేఖరుడికీ, కులశేఖరుడికీ మాత్రమే తెలుసు.

మోహిని ఇంత కాలంగా దేనికి చికిత్స పొందుతున్నదీ రామశర్మకు అంతు బట్టలేదు. మోహిని పట్ల అతని ప్రత్యేక శ్రద్ధకు కారణం ఏమంటే, అతను ఆమెను పెళ్ళాడాలని గాఢంగా వాంఛిస్తున్నాడు. కాని అతనికి ఆ మాట పైకి అనే స్థాయి కూడా లేదు. కులశేఖరుడు సంఘంలో చాలా ఉన్నతస్థాయిలో ఉన్నాడు. రామశర్మ ఆ స్థాయికి పెరగలేడు. కాని ఏ కారణం చేతనైనా కులశేఖరుడి ఉన్నతిని దెబ్బ కొట్టగలిగితే, మోహిని తనకు అందుబాటులోకి రావచ్చు.

అయితే రామశర్మ చూస్తూండగానే మోహినికి గొప్ప ఇంటి సంబంధం కుదిరింది. నిశ్చయ తాంబూలాలు కూడా ఇచ్చి; ప్రధానం చేసుకున్నారు.

ఇలాటి పరిస్థితిలో రామశర్మకు తలవనితలంపుగా మోహిని వ్యాధి



రహస్యం తెలిసిపోయింది. రాజశేఖరుడు ఎవరో రోగిని చూడటానికి తొందరగా వెళ్ళిపోతూ, మోహిని కిచ్చే మందులున్న పెట్టెకు తాళం వేయటం మరిచాడు. రామశర్మ ఆ పెట్టె తీసి, మందులు పరీక్షించి, అప్పటికి తాను సంపాదించిన జ్ఞానంతో, మోహిని కుష్ఠువ్యాధికి చికిత్స పొందిందని తెలుసుకున్నాడు. ఆమె తనకు ఎలాగూ దక్కదు గనక, ఆమెకు వచ్చిన సంబంధం చెడగొట్టి, ఆమెకు ఎప్పటికీ పెళ్లి కాకుండా చెయ్యాలన్న కసితో, రామశర్మ మోహిని జబ్బు గురించి ఊళ్ళో అందరికీ చెప్పేశాడు. రామశర్మ వైద్యుడి శిష్యుడు కావటంచేతా, మోహిని

రెండేళ్లుగా వైద్యం చేయించుకున్నా ఆమె వ్యాధి ఫలానా అన్నది రహస్యంగా ఉంచబడటంచేతా, ఊళ్ళో వాళ్ళు రామశర్మ చెప్పినది సులువుగా నమ్మారు.

నిశ్చయం అయిన సంబంధం కాస్తా వెనక్కు పోయింది.

కులశేఖరుడికి ముందు అనుమానం రాజశేఖరుడి మీదికి పోయింది. అతనే మోహిని జబ్బు గురించి రామశర్మకు చెప్పి ఉంటాడనుకుని, కులశేఖరుడు రాజశేఖరుణ్ణి ప్రతిఘటించాడు.

"మీ అమ్మాయి వ్యాధి గురించి నేను ఎవరికీ చెప్పలేదు. ఆ రహస్యం తెలుసుకున్నవాడు నా శిష్యుడే గనక, జరిగిన దానికి విరుగుడు నేనే చెయ్యాలి. మీరు న్యాయస్థానానికి వెళ్ళి, నా శిష్యుడు రామశర్మ మీ అమ్మాయి మీద అసత్య ప్రచారం చేసి, మీ పరువు తీశాడనీ, ఆమె పెళ్ళి చెడగొట్టాడనీ ఫిర్యాదు చెయ్యండి. నేను మీ తరఫున సాక్ష్యం పలుకుతాను," అని సలహా ఇచ్చాడు రాజశేఖరుడు.

కులశేఖరుడు రాజశేఖరుడు చెప్పిన విధంగా రామశర్మ మీద ఫిర్యాదు తెచ్చాడు. న్యాయాధికారి రాజశేఖరుణ్ణి పిలిపించి అడిగాడు.

"మోహినికి ఇప్పుడు కుష్ఠు వ్యాధి లేదు. రామశర్మ ఆమె స్థితి తెలుసుకోకుండా ఆమెకు ఆ వ్యాధి ఉన్నదని లోకాన్ని నమ్మించాడు. ఆమెకు నిశ్చయమైన సంబంధం చెడిపోవలసిన అవసరం లేదు. పెళ్లికొడుకు స్థానంలో నేను ఉండిన పక్షంలో ఆమెను తప్పక వివాహం చేసుకుని ఉందును," అని రాజశేఖరుడు న్యాయస్థానంలో చెప్పాడు.

రామశర్మ ఆ ఊళ్ళో ఎవరికీ మొహం చూపించటం చేతగాక, ఊరు విడిచి పోయాడు. తప్పిపోయిన సంబంధాన్ని తిరిగి తెచ్చుకునే ప్రయత్నం చేసేకన్న, మోహినిని భయంకరమైన రోగం నుంచి కాపాడి, ఆమెను పెళ్లాడటానికి సిద్ధంగా ఉన్న రాజశేఖరుడికే ఆమెనిచ్చి కులశేఖరుడు పెళ్లిచేశాడు.





# దేవీ భాగవతం

సుదర్శనుణ్ణి పెళ్ళాడే ఆలోచన మానుకో మని చెప్పినందుకు, శశికళ తల్లితో ఇలా అన్నది:

"అమ్మా, అతను అడివిలో ఉంటేనేం? పట్నంలో ఉంటేనేం? అతనికి డబ్బు లేకపోతేనేం? నవనిధులూ ఉంటేనేం? నా మనసు అతన్ని తప్ప మరొకణ్ణి కోరదు. విధి లిఖితాన్ని బ్రహ్మ కూడా మార్చలేడుగదా! భర్తకు ఆనందంగా సేవ చేసే మనిషికి స్వర్గమూ, మోక్షమూ, సమస్తమూ కలుగుతాయిగదా, అమ్మా! నా భవిష్యత్తు మహాదేవి నిర్ణయించింది. నా కిష్టమైనవాడు సుదర్శనుడే!"

శశికళ తల్లి తన కూతురన్న మాటలు భర్తకు చెప్పింది.

స్వయంవరం దగ్గిర పడుతున్నది. సుదర్శనుడు రాలేదు. శశికళ తనకు హితుడైన ఒక బ్రాహ్మణ్ణి రహస్యంగా పిలిపించి, అతనితో, "అయ్యా, మా తండ్రికి తెలియకుండా నువు భరద్వాజాశ్రమానికి వెళ్ళి, సుదర్శనుణ్ణి కలుసుకుని, నేను చెప్పానని చెప్పు! 'అంబ నన్ను సుదర్శనుణ్ణే పెళ్ళాడమన్నది. నాకు స్వయంవరం జరగబోతున్నది. రాజులంతా వచ్చి విడిసి ఉన్నారు. నా మనసు నీ మీద నిలిచి ఉన్నది. కాని, సుదర్శనా, నువు రాలేదు. నేను నిన్ను తప్ప మరొకరిని వరించను. నిన్ను పెళ్ళాడలేని పక్షంలో అగ్నిలో దూకేస్తాను. ప్రాణాలతో ఉండేది మటుకు కల్ల! అంబ దయవల్ల



మనకు సమస్త శుభాలూ చేకూరుతాయి. ఆమె మాట వృథా కాదు. ఆ జగన్మాతను నమ్మి, నువు తప్పక రావాలి. నన్ను చేపట్టు,' '' అని చెప్పింది.

ఆ బ్రాహ్మడు శశికళ సందేశంతో బాటు దక్షిణ కూడా పుచ్చుకుని, భరద్వాజాశ్రమానికి వెళ్ళి, సుదర్శనుణ్ణి కలుసుకుని, సంగతి అంతా చెప్పాడు. ఇంకేమున్నదీ? సుదర్శనుడు స్వయంవరానికి బయిలుదేరాడు. మనోరమ గుండెల్లో రాయిపడింది. ఆమె ఆపుకోలేని దుఃఖంతో కొడుకుతో ఇలా అన్నది:

"అంతమంది రాజులున్న చోటికి తోడెవరూ లేకుండా ఒంటరిగా పోతావా? నీపాలిటి యముడు గదా యుధాజిత్తు? అక్కడికి తప్పక వస్తాడు. నాకు పుత్రశోకం తెచ్చిపెట్టకు. నాయనా! నా మాట కాస్త విను.''

దానికి సుదర్శనుడు, ''అమ్మా, దేవి అజ్ఞ పాలించే నాకు కీడు ఎలా కలుగుతుంది? ఇంకొకడి బలం చూసి నేను భయపడతానా? క్షత్రియ స్త్రీవి కంట తడి పెట్టవచ్చునా? అయేది ఎలాగూ అవుతుంది. సుఖ దుఃఖాలు కావడి కుండలు,'' అని తల్లికి ధైర్యం చెప్పి, నిషాదరాజు ఇచ్చిన రథం ఎక్కి బయలుదేరబోయాడు.

అప్పుడు మనోరమ అతన్ని దీవించి, "నాయనా, నిన్ను విడిచి క్షణం ఉండటమైనా నాకెంతో కష్టం. నిన్ను చూసుకుంటూనే కదా ఇంత కాలమూ హాయిగా గడిపాను. ఇప్పుడు నాకీ కష్టం ఎందుకు కలిగిస్తావు? నన్ను కూడా నీ రథం మీద తీసుకుపో,'' అన్నది.

సుదర్శనుడు సరేనని సైరంధ్రితో సహా తన తల్లిని రథం మీద ఎక్కించుకుని కాశీనగరం చేరాడు. స్వయంవరానికి వచ్చిన రాజుల కందరికీ చేసినట్టే సుబాహు సుదర్శనుడికి ఎదురు వచ్చి, అతనికి విడిది చూపి, పరిచారకులను నియమించాడు.

స్వయంవరానికి తన మనవడితో సహా వచ్చిన యుధాజిత్తూ, ఇతర రాజులూ సుదర్శనుణ్ణి చూసి, "తగుదునమ్మా అని సుదర్శనుడు స్వయంవరానికి వచ్చాడయ్యా! రాజుల కొడుకులనూ, రారాజుల కొడుకులనూ కాదని రాజకుమార్తె తననే వరిస్తుందనుకున్నాడో ఏమో! ఏమైనప్పటికీ చెప్పలేం! నవ్విన నాపచేనే పండిందంటారుగద!" అనుకున్నారు.

ఆ మాటమీద యుధాజిత్తు, "ఈసుదర్శనుణ్ణి నేను చంపేస్తాను," అన్నాడు.

అది విని కేరళరాజు, "ఇది ఇచ్ఛా స్వయంవరం. వధువు వచ్చిన వారిలో తన కిష్టమైనవాణ్ణి భర్తగా స్వీకరిస్తుంది. అందుకు మిగిలినవాళ్ళు ఆమోదించి తీరాలి. లేకపోతే ఈ రాజులకు మర్యాద తెలీదనే మాట వస్తుంది. అది అలా ఉంచు. నువు ఈ సుదర్శనుడి రాజ్యం అక్రమంగా కాజేసి నీ మనవడికి కట్టబెట్టావు. స్వయంవరంలో నీ మనవడే నెగ్గవచ్చుగదా? సుదర్శనుడే నిన్నేమైనా చేస్తాడేమో చూసుకో! ఏమైనా ధర్మం జయిస్తుంది. సత్యం వృద్ధి పొందుతుంది. దుర్మార్గానికి ఒడిగట్టకు. రాజకుమార్తె ఇంతమందినీ వరించలేదుగదా! ఒక్కణ్ణి వరిస్తుంది. మిగిలినవాళ్ళు అసూయ పడరాదు," అన్నాడు.



దానికి యుధాజిత్తు, "నువు చెప్పినట్టు ఇది ఇచ్ఛా స్వయంవరమే. ఉన్నవారిలోకి ఎక్కువయోగ్యుణ్ణి రాజకుమార్తె వరిస్తే మాకూ సంతోషమే. కాని ఇంతమంది తేజోవంతులూ, ఉత్తమోత్తములూ అయిన రాజకుమారులుండగా, ఆమె ఊరూ పేరూ లేనివాణ్ణి ఎవణ్ణో వరిస్తే, మిగిలినవారంతా చూస్తూ ఊరుకోవలసిందేనా? సింహం భుజించేది నక్కకు దక్కటమా? ఏమిటి నువు చెప్పే నీతి? బ్రాహ్మణులకు వేదాలు బలం. క్షత్రియుడికి విల్లు బలం. క్షత్రియ వివాహాలకు బలమే శుల్కం. ఈ వధువు బలం గలవాడి సొత్తు!" అన్నాడు.



"అది సుదర్శనుడికే అయితే అతన్నే తీసుకోనీ!" అని కొందరు పేచీ పెట్టారు.

స్వయంవరానికి వచ్చిన రాజుల మధ్య వాగ్వాదం పెరిగింది. సుబాహుణ్ణి పిలిపించారు. వారి వివాదం విని సుబాహుడు, "రాజులారా! నా కూతురు సుదర్శనుణ్ణి మనస్ఫూర్తిగా వరించ గోరుతున్నది. అతను అర్హుడు కాడంటే వినదు. అతను స్వయంవరానికి రానేవచ్చాడు. ఎలా జరగాలని ఉంటే అలా జరుగుతుంది. వాగ్వాదాలు దేనికీ?" అన్నాడు.

సుబాహు వైఖరి తేలిపోయింది గనక, రాజులు సుదర్శనుణ్ణి పిలిపించి, "నువు ఒంటరిగా వచ్చావు. సేనలను వెంటబెట్టుకువచ్చిన రాజకుమారులు అనేక మంది యుద్ధం చేసి అయినాసరే శశికళను పెళ్లాడే ఉద్దేశంతో ఉన్నారు. నువు ఏం చెయ్యగలవు? నీ తమ్ముడు శత్రుజిత్తు అమిత శౌర్యవంతుడు; మహాయోగ్యుడు; అందగాడు. అతనికి సహాయంగా అతని తాత, ప్రత్యేకించి నిన్ను చంపటానికే వచ్చి ఉన్నాడు. నువు రావటం ఎంత పొరపాటో ఆలోచించావా? నిన్ను ఎవరు పిలిచారో? నువు ఎందుకు వచ్చావో మరి? కాని ఉన్నమాట చెప్పాం. తరవాత నీ యిష్టం!" అన్నారు.

వారితో సుదర్శనుడు, "రాజులారా, మీ దయకు ఎంతో కృతజ్ఞుణ్ణి. కాని ఇంత దాకా వచ్చి భయపడి ఏం లాభం? నా భారమంతా నన్నిక్కడికి పంపిన మహామాతది! ఆమె నాకు ఏదో సహాయం చెయ్యకుండా శత్రువులకు అప్పగిస్తుందా? నాకు శత్రువులూ, మిత్రులూ అంటూ లేరు; అంతటా ఆ ఈశ్వరే కనబడుతుంది. ఆమె వెళ్ళమంటేనే నేనీ స్వయంవరానికి వచ్చాను. నా మీద ఎవరైనా అలిగితే వారు దేవికి శత్రువులౌతారు! నాకు సేనలు లేవంటారా? అవసరం లేదు. ఏ దేవి ఎంతటి దుర్బలుడికైనా బలమూ, సంపదా ఇస్తుందో ఆ దేవే నాకు బలం! ఇతర బలాలతో నాకు పని

లేదు. శక్తులూ, అశక్తులూ అంటూ ఉండరు. మహాశక్తి అనుగ్రహానికి పాత్రులైనవారే శక్తిమంతులు; అనుగ్రహం లేనివారు బ్రహ్మాదులైనా శక్తిహీనులే! నాకు జయం కలిగినా, అపజయం కలిగినా అది జగదంబదిగాని, నాది కాదు. అందుచేత నన్ను గురించి చింతించకండి," అన్నాడు.

ఈ మాటలకు కొందరు రాజులు సంతోషించి, "అయ్యా, నీ మాటలు ముమ్మాటికీ నిజం! నువు పుణ్యాత్ముడివి. కాని నీ మీద యుధాజిత్తు పగపట్టి ఉన్నాడు, మరచిపోవద్దు సుమా!" అన్నారు.



వారు అలా అన్నమీదట సుదర్శనుడు వారితో, "రాజులారా, నా మీద మీకు గల అనుగ్రహంకొద్దీ మీరీ మాట నాకు చెప్పారు. ఈ సృష్టిలో చావు ఒకరి అధీనంలో ఉండేది కాదు. ప్రాణి అయినవాడు కర్మానికి కట్టుబడినవాడు. వాడికి స్వేచ్ఛ లేదు. కాలమూ, కర్మమూ, స్వభావమూ అనేవి అంతా నిర్ణయిస్తాయి. కాలం రాకపోతే దేవుడు కూడా చంపలేడు. యమధర్మరాజు కూడా నిమిత్తమాత్రుడే. నా తండ్రిని చంపిన సింహమూ, మా తాతను చంపిన యుధాజిత్తూ కూడా నిమిత్తమాత్రులే. ఒకవేళ చావు రావలసే ఉంటే తప్పించగలవాడెవడు? ఒకరిని ఒకరు రక్షించేదేమిటి? దైవబలం ఉంటే వెయ్యి ఏళ్ళు బతకవచ్చు! నేను దైవాన్ని నమ్ముకుని వచ్చాను. నాకు అండగా ఉండే సేన కూడా దైవమే. నాకు శత్రువు ఉంటే అది కూడా దైవమే," అన్నాడు.

ఈ మాటలు విని అందరూ సంతోషించారు.

సుదర్శనుడు తన విడిదికి వెళ్లాడు.

మర్నాడు స్వయంవరం. సుబాహుడి ఆహ్వానం అందుకుని వచ్చిన రాజులందరూ సమావేశమై, శశికళ కోసం ఎదురుచూస్తున్నారు. ఆమె ఎవరిని వరిస్తుందో అని కొందరు ఆశ్చర్యపడు



తున్నారు ; సుదర్శనుణ్ణి తప్ప మరొకరిని వరించదని కొందరు నమ్మకంగా చెబుతున్నారు ; అలా అయితే యుద్ధం తప్పదని మరికొందరు ఇంకా నమ్మకంగా అంటున్నారు.

మంగళ వాద్యాలు మోగుతూండగా, శశికళ స్నానం చేసి, అలంకరించుకుని, పట్టుబట్టలు ధరించి, చేతిలో ఇప్పపూల మాల పట్టుకుని, చెలికత్తెలతో సహా వచ్చింది. కాని ఆమె ఒక స్తంభం వద్ద ఆగిపోయి, తల వంచుకుని, ఏదో ఆలోచిస్తున్నట్టు నిలబడింది.

అది చూసి ఆమె తండ్రి సుబాహుడు నవ్వుతూ, ''అమ్మా, చూడు! ఇవాళ ఇక్కడ ఎంతెంతో గొప్ప రాజకుమారులు, ఎంతో అందగాళ్ళు, ఎంతో కీర్తిమంతులు, నిన్ను పెళ్ళాడాలని వచ్చి ఉన్నారు. అన్ని విధాలా నీకు వీరిలో నచ్చినవాణ్ణి ఏరుకో!'' అన్నాడు.

ఆ మాటకు శశికళ, ''వీరు కాముకులూ, ఉన్మత్తులూ, దుర్మార్గులూ, పాపులూనూ! సాధ్వి అయినది వీరి ఎదటికి రాగూడదు ; తన భర్తను తప్ప మరొకరిని చూడరాదు. వరమాల పట్టుకుని అనేకమంది మధ్యకు వచ్చేది వెలయాలు కాదా? ఈ రాజుల మధ్యకు రావటానికి నేను వెలయాలినా, నాన్నా? నేను సుదర్శనుడి సొత్తును గదా! ఇతరులను నేను చూసే అవసరం ఏమున్నదీ? నన్ను నేను ఎందుకు అవమానించుకోవాలి? ప్రపంచం తలక్రిందులైనా నేను మరొకరిని వరించను. అందుచే ఇవాళో, రేపో నన్ను సుదర్శనుడికే ఇచ్చి పెళ్ళి చెయ్యి,'' అన్నది.

సుబాహుడు ఇరుకున పడ్డాడు. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. వచ్చిన రాజులు మహాబలవంతులు, హెచ్చు సంఖ్యలో ఉన్నారు. బతిమాలి పొమ్మంటే పోరు. తన కూతురికి నచ్చిన సుదర్శనుడికి గాలి తప్ప మరే అండా లేదు. వీరందరి చేతా తనకు చావు తప్పేటట్టు లేదు!

కూతురు కాస్తా మృత్యుదేవత అయి కూర్చున్నది!

ఇలా ఆలోచించి సుబాహుడు అతి వినయంగా రాజుల మధ్యకు వెళ్ళి చేతులు జోడించి, ''మహారాజులారా! దయామయులారా! మహాత్ములారా! నా తప్పు క్షమించి, నా మీద అనుగ్రహం ఉంచి, నే నిచ్చే కానుకలు పుచ్చుకుని, దయచెయ్యమని నా ప్రార్థన. ఎన్ని విధాల చెప్పి చూసినా నా కూతురు మరొకరిని వరించ నిరాకరించుతున్నది. దానికి అశుభమూ, శుభమూ తెలీదు. నామూలంగా మీకందరికీ నిష్కారణంగా శ్రమ కలిగింది. నా తప్పు మన్నించితే మీకు ఏనుగులూ, రత్నాలూ, గుర్రాలూ, గ్రామాలూ, దాసీలూ, ధనమూ, ఇళ్ళూ, తోటలూ, నా రాజ్యమంతా ఇచ్చేస్తాను!'' అంటూ ఎన్నో విధాల ప్రార్థించాడు.

కాని అతనికి ఎవరూ ఎలాటి సమాధానమూ ఇయ్యలేదు. యుధాజిత్తు మాత్రం కోపంతో పళ్ళు పటపటా కొరుకుతూ, "ఏమిటి నువ్వనేది? బుద్ధిలేక నీ కూతుర్ని సుదర్శనుడి కియ్య నిశ్చయించి, వచ్చినవారిని వెళ్ళగొట్టలేక, నక్కజిత్తులు అవలంబిస్తే మేమందరమూ మూర్ఖులమనుకున్నావా? మొదటనే అనుమానం ఉన్నప్పుడు మూర్ఖుడివై ఇందరినీ ఎందుకు పిలిపించావు? పిలిపించిన వాడివి ఇప్పుడేడ్చి ఏం లాభం? చూడు, నేను నీ మదం అణచి, ఈ సుదర్శనుడి సంగతి ఏదో తేల్చి, నా మనమడికి నీ కూతుర్ని పెళ్ళి చేస్తాను! నాకీ సుదర్శనుడు ఉప్పా, ఊరగాయా! అందరూ ఏకమైనా ఒక్క నిమిషంలో అందరినీ జయిస్తాను! లోగడ భరద్వాజ మునిని చూసి వాడి ప్రాణం తీయలేదు. ఇవాళ వాణ్ణి ఉపేక్షించను. నీ కూతుర్ని నా మనమడికిచ్చి పెళ్ళి చేసి, నిన్నూ, నీ రాజ్యాన్నీ కాపాడుకో. లేదూ? నీ కూతుర్ని సభలోకి వచ్చి, సుదర్శనుణ్ణి తప్ప మరెవరినన్నా వరించమను,'' అన్నాడు.





# బద్ధకస్తుడి వ్యవసాయం

నారాయణ అమిత బద్ధకస్తుడు. వాడికి ఎంత బద్ధకమో, తన సమర్థతపై అంత నమ్మకం. వాడి తండ్రి సంవత్సరం పొడుగునా కష్టపడుతూంటే, వాడు మాత్రం రచ్చబండ దగ్గిర చేరి, కోతలు కోస్తూండేవాడు.

''నువు కూడా, తోటివారిలా, వ్యవసాయంలో నీ తండ్రికి కాస్త సాయం చేయరాదుట్రా? నీకు వ్యవసాయం చేయించటమూ వస్తుంది, మీ తండ్రికి కాస్త విశ్రాంతీ దొరుకుతుంది,'' అని ఎవరైనా పెద్దవాళ్లు మందలిస్తే, నారాయణ ఈసడింపుగా, ''వ్యవసాయంకోసం అలా సంవత్సరం పొడుగునా కష్టపడాలటే, తాతయ్యా? నేను వ్యవసాయం చేయించానంటే ఇంట్లో నుంచి కాలు కదపకుండా, మీ కంటె తక్కువ ఖర్చుతో పంట తీయగలను,'' అనేవాడు.

తాను ఇంట ఉండగా తన కొడుకు బద్ధకం వదలదని గ్రహించిన వాడి తండ్రి, ఒకనాడు పొలం పనులు నారాయణకు అప్పగించి, ఒక సంవత్సరం పాటు తీర్థయాత్రలు చేసి తిరిగి వస్తానని వెళ్ళిపోయాడు.

తాను ఎంత సులువుగా వ్యవసాయం చేయించగలడో చూపే అవకాశం నారాయణకు వచ్చింది. ఇంతలో నారు పోసే తరుణం కూడా వచ్చింది. అంత చిన్న పనికి తాను స్వయంగా పొలం వెళ్లాలా అనుకుని, నారాయణ పొరుగునే ఉన్న రామయ్య దగ్గిరికి వెళ్లి, ''చూడు, రామయ్య మామా! నువు ఎలాగూ నారుమడి చల్లబోతున్నావు గనక, కాస్త నా విత్తనాలు కూడా చల్లిపెట్టు; కావలసిన విత్తనాలు తీసుకుని మా పాలేరు వస్తాడు. నువు విత్తనాలు చల్లితే నారు

గుంటక సాంబిరెడ్డి



బాగా వస్తుందని నాన్న అంటూంటాడు,'' అన్నాడు.

రామయ్య నారాయణ వంక ఎగాదిగా చూసి, ''అలాగేలే, అల్లుడూ. ఈ మాత్రానికి ఇంతగా చెప్పాలా? నీకింకే సాయం కావలసినా చెప్పు, తప్పకుండా చేస్తాను,'' అన్నాడు.

ఆ విధంగా నారాయణకు నారుమడి వేసే బాధ తప్పింది. వాడు తన తెలివి తేటలకు తానే మురిసిపోయాడు. నారు పెరిగి నాట్లు వేసేటప్పుడు కూడా నారాయణ పొలం చాయలకు పోనవసరం లేకుండా, రామయ్యే నాట్లు కూడా వేయించాడు.

కలుపు తీసేటప్పుడు నారాయణ పాలేరే కూలీలను తీసుకుపోయి, ఆ పని పూర్తి చేయించాడు.

ఒక రోజు ఉదయం ఎరుకలవాడు వచ్చి, నారాయణకు దండం పెట్టి, ''దొరా, ఏటా తమ పొలంలో నేనే ఎలకలు పట్టుతూంటాను. రేపు వెళ్లి ఎలకలు పట్టమంటారా?'' అని అడిగాడు.

''ఎలక్కి ఎంత తీసుకుంటావు?'' అని నారాయణ వాణ్ణి అడిగాడు.

''అందరితోపాటే ఇయ్యండి. అందరూ ఎలక్కి నాలుగణాలు ఇస్తున్నారు.'' అన్నాడు ఎరుకలవాడు.

''ఎలక్కి మూడణాలు చొప్పున ఇస్తాను,'' అన్నాడు నారాయణ.

మర్నాడు వాడు అరవైరెండు చచ్చిన ఎలకలను తెచ్చి, నారాయణకు చూపించి, ఎలక్కి మూడేసి అణాల చొప్పునే పట్టుకు పోయాడు. పోతూ పోతూ వాడు కుప్ప నూర్పిడికి వస్తానని మాట ఇచ్చాడు.

అందరూ నాలుగేసి అణాలిస్తూంటే తాను మూడేసి అణాలే ఇచ్చి, ఎలకల బాధ వదిలించుకుని, డబ్బు ఆదా చేసుకున్నందుకు నారాయణ తనను తాను అభినందించుకున్నాడు.

ఒక రోజు నారాయణ రచ్చబండ నుంచి ఇంటికి వస్తూంటే, పొరుగు రైతు

కనకయ్య, పలకరించి, ''చూడు, నాయనా, పైరుకు తెగులు పడుతున్నది. ఒకసారి మందు చల్లించటం మంచిది. తొందరలోనే ఆ పని చూడు,'' అన్నాడు.

నారాయణ వెంటనే కనకయ్యతో, ''నువ్వెప్పుడు మందు చల్లిస్తావో చెబితే, నేనూ అప్పుడే చల్లిస్తాను,'' అన్నాడు.

''నేను రేపు పొద్దున్నే చల్లిస్తున్నాను. కావాలంటే నువు కుడా రా,'' అన్నాడు కనకయ్య.

నారాయణ కొంచెం తటపటాయిస్తున్నట్టుగా, ''ఒక చిన్న సహాయం చెయ్యగలవా, కనకయ్యా? రేపు పొద్దున్నే నాకో చిన్నపని తగిలింది. నువ్వేమీ అనుకోకపోతే, నా పొలానికి కూడా మందు చల్లించి పెడుదూ! ఇప్పుడే డబ్బిస్తాను,'' అన్నాడు.

ఆ మాత్రం సహాయం చెయ్యటానికి కనకయ్య సంతోషంగా ఒప్పుకుని, డబ్బు తీసుకున్నాడు.

కోతలు కోసి, కుప్ప వెయ్యటం కూడా నారాయణ పొలం వెళ్ళకుండానే జరిగిపోయింది. ఈ మాత్రం వ్యవసాయం కోసం అందరూ ఎందుకంత హైరాన పడిపోతారో నారాయణకు అర్థం కాలేదు. వాడికి తన సమర్థతలో ఇప్పుడు పూర్తి నమ్మకం కుదిరింది.



కుప్ప నూర్చటానికి రామయ్యా, కనకయ్యా, ఎరుకలవాడూ, నారాయణ పాలేరూ దగ్గిర ఉంటామన్నారు. నూర్పిడి రోజునైనా తాను పొలం కేసి తొంగి చూడకపోతే బాగుండదని, బద్ధకాన్ని ఎలాగో వదిలించుకుని, బాగా తెల్లవారు ఝామునే లేచి, పొలం బయలుదేరాడు నారాయణ.

పొలాలలో ఇంకా చీకటి ఉండగానే నూర్పిళ్ళు ప్రారంభమయాయి. కాని నారాయణ తన పొలం చేరేసరికి, అక్కడ ఇంకా పని మొదలు పెట్టలేదు. అంతా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. నారాయణ పక్కనే చాటుగా ఆగి, వాళ్ళ మాటలు వినసాగాడు.

"భలే దొరికాడురా నీకూ! అతడి ధర్మమా అని నాకు ఈ యేడు నారు మడి ఖర్చూ, శ్రమా తప్పాయి. నాకు కావలసిన నారు కూడా అతని చేతనే పోయించి, నారు పీకే కూలీ, నాట్లు వేసే కూలీ కూడా అతని చేతనే పెట్టించాను. నువు ఏమాత్రం చేసుకున్నావురా?" అని రామయ్య నారాయణ పాలేరును అడుగుతున్నాడు.

వాడు ఇకిలిస్తూ, "నేను మిగుల్చుకున్నది ఏ పాటిలెండి? పదేసిమంది కూలీలను పెట్టి, పదిహేనుమందిని పెట్టానని చెప్పాను," అన్నాడు.

"నా పైరుకి చీడ పట్టినప్పుడు మందులు కొనటానికి నా చేతిలో దమ్మిడీ లేదు. అంతలో మనవాడు గుర్తుకొచ్చాడు. 'మందు చల్లించావా, నారాయణా?' అంటే నన్నే చల్లించమని డబ్బిచ్చాడు. గొప్ప బద్ధకస్తుడు గద! వాడి పుణ్యమా అని నా పైరుకు మందు చల్లుకున్నాను," అన్నాడు కనకయ్య పకపకా నవ్వుతూ.

అయ్యా, నేను కూడా చేసిన పని చెబితే పోతుంది. రోజంతా నలుగురి పొలాలలో ఎలకలు పట్టితే అరవై రెండు దొరికాయి. అందరి దగ్గిరా డబ్బులు వసూలు చేసుకుని, మొత్తం ఎలకలన్నీ తీసుకుపోయి, 'తమ పొలంలో దొరికాయండీ?' అంటే నమ్మేశాడాయన. అంతా ఎలక్కి పావలా ఇస్తుంటే తాను మూడణాలకు బేరం చేసి, డబ్బు ఆదా చేశానని సంబర పడ్డాడుగాని, నిజంగా ఆయన చేలో దొరికినవి పది ఎలకలే!" అన్నాడు ఎరుకలవాడు.

"మనం కూడా పని ప్రారంభింతామా?" అన్నాడు రామయ్య.

"తొందరేముందీ? మరో గంట ఆగి మొదలుపెట్టుదాం," అన్నాడు కనకయ్య.

చాటునుంచి ఈ మాటలన్నీ విన్న నారాయణకు గుండె జారిపోయింది. మరుసటేడు వాడు తండ్రికి తీసిపోకుండా వ్యవసాయం పనులు చేసి, తన బద్ధకానికి స్వస్తిచెప్పాడు.



# గయ్యాళి భార్య

ఒక గ్రామంలో రామన్న అనే యువకుడు అందచందాలు చూసి మోహించి, ఒక పరమ గయ్యాళిని చేసుకుని, చాలా కాలం నరకం అనుభవించి, తన కష్టాలు ఒక స్నేహితుడికి చెప్పుకున్నాడు. ఊళ్ళోకి ఒక సాధువు వచ్చాడనీ, అందరూ తమ కష్టాలు ఆయనకు చెప్పుకుని, వాటిని తొలగించుకునే మార్గం తెలుసుకుంటున్నారనీ స్నేహితుడు రామన్నతో అన్నాడు. రామన్న ఆ సాధువును సందర్శించి, తన బాధ చెప్పుకున్నాడు.

అంతా విని సాధువు, "బాబూ, నేను నీలాగే గయ్యాళి భార్యతో వేగలేక, సన్యాసినై తిరుగుతున్నాను. నీకేం సలహా ఇయ్యగలను?" అన్నాడు.

తరవాత రామన్న పొరుగు గ్రామం వేంచేసిన నిత్యానంద స్వాములను కలుసుకుని తన గోడు చెప్పుకున్నాడు.

"నాయనా, నేను కటిక పేదవాణ్ణి. అందుచేత నాకు పెళ్ళి కాలేదు. సంసారం ఎరగను. నీకు సలహా చెప్పే అర్హత నాకు లేదు," అన్నాడు నిత్యానందుడు.

రామన్న అక్కడినుంచి ఒక పాడుబడిన ఇంటి సమీపంలో కూర్చుని ఆలోచిస్తూండగా, ఎవరో వెనకగా వచ్చి భుజం మీద చెయ్యి వేసి, "నాయనా, ఏమిటి నీకు వచ్చిన కష్టం? నన్ను చంద్రయ్య అంటారులే," అన్నాడు.

రామన్న చంద్రయ్యతో తన కష్టం చెప్పుకున్నాడు. చంద్రయ్య బిత్తరపోతూ, "నేను గయ్యాళి భార్యతో వేగలేక ఆత్మహత్య చేసుకున్నాను. నా భార్య చావు బతుకుల్లో ఉన్నది. చచ్చి నా వెంట పడుతుందేమోనని హడలిపోతున్నాను," అని మాయమయాడు. —రాంబాబు



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.


P. Sundaram




P. Sundaram

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : జోడు నిజం, తోడు నిజం!

రెండవ ఫోటో : జోడూ తోడూ లేవు, నిజం!

పంపినవారు : ఎస్. లక్ష్మి, రాజానగర్ కాలనీ, కాకినాడ-4

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# మా పాఠకులకు విజ్ఞప్తి



మన ఆంధ్ర కోస్తా జిల్లాలు నెల్లూరునుండి విశాఖపట్నం వరకు 1979 మే 11,12 తేదీల్లో పెనుగాలులతో, తుఫానుతో అస్తవ్యస్తం అయిపోయినవి. లక్షలాది ప్రజలు నిరాశ్రయులయ్యారు. విద్యుత్ సరఫరా, కమ్యూనికేషన్లు విచ్ఛిన్నమయ్యాయి. కోట్లాది విలువగల పంట నీళ్ళపాలయినది. మన సోదర ప్రజల సేవకై ఆంధ్ర ప్రభుత్వానికి విరివిగా విరాళాలు పంపి సాయపడమని మా ప్రార్థన.

—చందమామ



విరాళములు నగదు, వస్తు రూపంలో **"తుఫాను సహాయక కమిషన్ రెవిన్యూశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు-500 022"** కు, లేక "జిల్లా కలెక్టర్లకు" పంపండి.


AND...
I


DADDY
MUMMY




EKCO
SKETCH PEN
FOR
SKETCHING
COLOURING • SIGNING

CHANDAMAMA (Telugu) JUNE 1979 Regd. No. M. 4854

# పాపిన్స్ కాగితంతో తమాషా

## రామ్, శ్యామ్

మీకిష్టమైన ఇద్దరూ, మరో కొత్త కాగితపు చిటకా, చెయ్యటం మరెంతో గమ్మత్తు

**ఉషారైన టోపీలు**

వెడల్పుకన్నా 1½ రెట్లు పొడుగు గల కాగితం తీసుకోండి. (అంటే న్యూస్ పేపర్ కాగితపు తావు ఒకటి చక్కగా సరిపోతుంది).



చుక్కలు పెట్టిన గీతవైపు తిన్నగా, కాగితాన్ని మడిచి, ఆ మడతను విప్పండి. ఇప్పుడు మళ్ళా కాగితాన్ని రెండుగా, అంటే చుక్కలు పెట్టిన మరొక కాగితపు గీతం వైపు బాణాలున్న తీరులో, మడవండి.



మధ్యవైపు మడవండి.



క్రిందవున్న పక్క కాగితాల్ని పైకి మడవండి—ఒకటి ఒక వైపుగానూ, మరొకటి మరొక వైపూను. అంతే. మీ టోపీ తయారు; దాన్ని పెట్టుకుని పక్కుమని నవ్వండి.






పార్లే

# పాపిన్స్

పండ్లరుచిగల పిప్పరమెంట్లు
నోరూరించే...మనసుదోచే...మైమరపించే

5 పండ్ల సువాసనలలో—
రాస్బెరి, అనాస, నిమ్మ,
నారింజ, మోసంబి

everest/78/PP/248-tl